# ఉపోద్ఘాతము

కేరళదేశ లక్ష్మియింట నిరుద్ధశోభాగము లయియుండిన భాసకృతిరత్నములు వెలువడి పండితకంఠపరిష్కారము లగుచుండుట నెల్లాంధ్రకు విదితమే కదా. ఇంచుమించుగా నైదుసంవత్సరములకుఁ బూర్వము స్వప్నవాసవదత్త ప్రతిజ్ఞాయౌగంధరాయణముల మాత్రము తాళపత్ర ప్రతుల సంపాదించి వాని రససంపదకు మెచ్చి తెనిఁగించి యుంటిని. ఇటీవలఁ గార్యాంతరముగాఁ గేరళదేశమున కేతెంచి తత్కాలము గల పదునొకండు రూపకములఁ జదివి యభూతపూర్వమగు నానందమును జెంది వానినెల్ల నల్పకాలములోఁ దెనిఁగించితిని. నేనెన్నఁ డాంధ్రీకరణమునకు దొరకొనఁ గోరకున్నను భాసరూపకములఁ బక్షపాతము నంది యమ్మహాకవికి భక్తిపూర్వకముగా నర్చనాకుసుమములఁ బడసి చినట్లు భావించి యికార్యమునకు సమకట్టితిం గాని గీర్వాణభాషలో నాకుఁగల యత్యల్ప పాండిత్యముచే నిట్టిపని నిర్వహింతునాయని యూహింపనైతి. నేఁటికాలమున నెల్లాంధ్రకవులు కాళిదాసాదులకృతులఁ దెనిఁగించి కరకౌశల మలవఱచుకొని మిన్నలయి యుండుటయు, వారలును భాసరూపకములఁ దెనిఁగింపఁబోవుటయు నెఱిఁగియు, 'నేరక యపకీర్తి జగతి నిలుపుట కాదే' యను సత్యోక్తి ప్రభావము గుర్తించియు నిట్లు సాహసించుట కేవల మాత్మవినోదార్థము కాని వైదుష్య స్పర్ధఁ జేసి కాదు.

ఈరూపకములననువదించి మూలముతోఁ జదివి చూడఁగా సుప్రసిద్ధ లగు గాయనగాయనీ జనములకంఠధ్వనికిని ననువా[illegible]నీ యంత్రములలో

సుప్రతిల్లు రాగవిశేషమునకును గలయంతరమే నామనంబునకు స్ఫురించెను. అయినను కోకిలాంగనాకంఠమాధుర్యమును వినలేని భావకుండు రవివర్మ చిత్రపటము కొని తేగలేక తేజోలేఖనమున సిద్ధమగు తత్ప్రతికృతులసౌందర్యమనుభవించు రసికునింబోలెనే ప్రతివాదినీయంత్రముల వినుట సంభవించుగదా. అట్లె సంస్కృత భాషాభ్యాసము లేనికొందఱకివియు నించుక రుచికరము లగునని తలంచుచున్నాను. నాయనువాదమున మూలాతిక్రమణము కొండొకచోట్లఁ గలుగుచుండును. అజ్ఞానవశమునఁ బెక్కుదోషములు సబద్ధములును బొందియుండును. ఇరువది సంవత్సరములుగాఁ బద్యరచనఁ బరిత్యజించిన నాకిదియు దుర్ఘటమేయై యుండెను. కావున నిందుఁ బదబంధము పరుషమై యుండినఁ బండితులు క్షమింతురుగాక. కీర్తిసేన యనుకవయిత్రి.

"క. చిరకాల మెడసి క్రమ్మఱ
నరుదెంచిన యాలునోలె నస్మత్కవితా
సరణి యనుకూలి గామియుఁ
దరతర మెడబాటు సేఁత తథ్యము మాకున్."

అన్నట్టులగునేమో.

దీనిలోని కథాభాగము బృహత్కథాది కృతులలో నెందును గానరాదు. ఇందుఁ గథానాయకుని విరహము శ్రుతపూర్వము గాక విశేషమును స్ఫురింపఁ జేయుచున్నది. రసభావ విశేషము లిందు స్వభావోక్తికి లక్ష్యము లగుటయే యీరూపకమునకు జీవాతువు. కథాభా పరిచయము లేకయె రూపకములఁ జూడనైనఁ జదువనైనఁ నొప్పని దీని లోనికథను సంగ్రహముగానైన నీకుండుటకు భావకులు క్షమింతురుగాక.

మా. రామకృష్ణకవి.

శ్రీరస్తు

# అవిమారకము

(నాద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

గురుకృప వార్ధినీట నొకకొమ్మునఁ దేలఁగ నుద్ధరించి, సం
గరమున దైత్యుఁగూల్చి యొకకాలనె చిమ్మి పరిగ్రహించి, యా
దరమున బాహువంగొని సుదర్శనరక్షితఁ జేసి, పొందు ని
ద్ధర వసురారి నీ కొసఁగుఁ దాల్చినఛత్త్రమునీడ నిల్పఁగన్ !

సూత్ర - (తెరవంకఁ జూచి) ఆర్యా ! ఇటురమ్ము !

నటి - (ప్రవేశించి) ఆర్య! ఇదిగో యున్నాను.

సూత్ర - ఆర్యా, నీ యంతర్గతభావము నీ వదనజనితకౌతూహలస్మితముచేతనే యెఱింగితి; ఏమో చెప్పఁబోయెదవు ?

నటి - నీ విట్టిభావజ్ఞుఁడవనుట యేమి యాశ్చర్యము !

సూత్ర - అట్లయిన యభీష్టముగాఁ జెప్పుము.

నటి - అయ్యతోఁగూడి యుద్యానవనమునకుఁ బోఁగోరెదను. నా కక్కడ స్త్రీలు చేయుకార్య మొకటి కలదు.

(తెరలో)

భూతిక, నీవును గురంగీరత్కుణార్థ ముద్యానమునకుఁ బొమ్ము. అంజనగిరికి మదము పట్టియున్నది కదా.

సూత్ర - ఆర్య, వింటివిగదా "రాజపుత్రి యుద్యానమునకుఁ బోయె" నని. కావున నిప్పు డుద్యానవనము నలువంకలు ద్వారబద్ధమయి యుండును. రాజసుత మరలి పోఁగానే మనము స్వేచ్ఛగాఁ బోవుదము.

నటి - చిత్త మార్యపుత్ర.

(నిష్క్రమింతురు)

---

# అవిమారకము

---

## ప్రథమాంకము

(రాజు పరివారముతోడఁ బ్రవేశించును.)

రాజు-

ఉ. జన్నము లే నొనర్చితిఁ బ్రసన్నులు నాదెస బ్రాహ్మణాళి వే
యన్నినరాజకోటికి భయంబన నిట్టిది నాఁగఁ జూపి య
త్యున్నతి నేలు నా కకట! యుల్లములోఁ బ్రమదంబు లే దిటన్
గన్నెలు గల్గుతండ్రులకుఁ గల్గు విచార మనేకభంగులన్!

కేతుమతి! పోయి దేవిం దోడ్తెమ్ము.

ప్రతీ - ప్రభూ! చిత్తము. (నిష్క్రమించును).

(పరివారముతో దేవి ప్రవేశించును.)

రాజు - దేవీ, నీముఖము నిత్యప్రసన్న మయ్యు నిప్పు డతి ప్రసన్నముగాఁ గానవచ్చుచున్నది. ఈప్రహర్షమున కేమయ్యెను?

దేవి - కురంగినిమిత్తము దూత వచ్చెనని మహారాజుగారు చెప్పినవారు కారా? కావునఁ ద్వరలో నల్లునిఁ జూడ వచ్చునని—

రాజు - అట్లే యున్నది. అయిన నింకను నిశ్చయము కాలేదు. ఇటుఁ గూర్చుండుము.

దేవి - మహారాజ, చిత్తము. (కూర్చుండును).

రాజు - దేవీ! వివాహ మనఁగా ననేకపరీక్షలు చూడవలసి యున్నవి; ఎందుకనఁగా,

గీ. తండ్రి యల్లునిసంపత్తిఁదలపకుండ
నిచ్చచొప్పనఁబడి కూఁతు నిచ్చునేని
మదముచే రెండు కులముల మాంపు నదియు
క్షుబ్ధజలనది యిరుదరిఁ గూల్చినట్లు.

ఏమీా - శబ్దమువలె నున్నది! పెక్కుకారణములవలనఁ బుట్టవచ్చును. ఇదె—

క. కలకలము చాలదవ్వనఁ
గలిగియుఁ బెల్లగుటఁజేసి కనఁదగు నికట
స్థితిఁబోలెఁ బెక్కుతెఱఁగులఁ
గలుగంజనుఁ గాని శంక గలుగుఁ గురంగీ.

దేవి - మన కుమారిత యుద్యానమునకుఁ బోయియున్నదిగదా!

రాజు - ఎవ్వఁ డక్కడ?

భటు - (ప్రవేశించి) మహారాజ, జయము. ఇతఁడె యార్యకౌంజాయనుఁడు. ఏమో నివేదించుటకు వచ్చియున్నాఁడు.

రాజు - త్వరగాఁ బ్రవేశపెట్టుము.

భటు - మహారాజ, చిత్తము. (నిష్క్రమించును).

(కౌంజాయనుఁడు ప్రవేశించును)

కౌం - (నిర్వేదముతో) అయ్యో! మంత్రిత్వమనఁగాఁ గష్టము! ఏలనఁగా—

ఉ. ఎత్తినపూఁపు సిద్ధి యగునేని జనంబులు రాజుశక్తికిం
మెత్తురు, రిత్తయై చెడిన మిక్కిలి మూఢులు మంత్రు లంచు వా
క్రుత్తురు, మాయమాత్యులని గొప్పఁగఁ జెప్ప నరేంద్రు లాత్మలన్
మ త్తగుఁ గాని బుద్ధిబలమత్తుల కియ్యవి సూక్ష్మదండముల్!

జయసేన! స్వామి యెచ్చట నున్నాఁడు? ఏమి చెప్పుచున్నావు—ఉపస్థానగృహములో ననియా—అయిన నాప్రదేశమునకు నిశ్శంకముగాఁ బోవచ్చును. (పరిక్రమించి సంభ్రమముతో) ప్రసాదము, ప్రసాదము, స్వామీ!

రాజు - సంభ్రమము వలదు వలదు. స్వేచ్ఛగాఁ గూర్చుండి వృత్తాంతము చెప్పుము.

కౌంజా-స్వామి, వినుఁడు; నాతోడ మీరు చెప్పితిరిగదా దేవర కుమారికతోడ నుద్యానమునకుఁ బొమ్మని?

రాజు - అగును, మఱియేమి?

కౌంజా - కావున నుద్యానమున కేఁగి యథాసుఖముగాఁ గ్రీడించి రాజసుత వచ్చుచుండఁగా దాసీదాసహసితకథితశ్రవణబృంహితమదస్రవన్మదజలార్ద్రీదుర్దినాననుఁడును, నిహితపతితసాదిపురుషుఁడును, క్షితిరజోవగుంఠితావ్యక్తభీమమూర్తియు, మూర్తిమంతుఁడగుపవనుం బోలె దృష్టాదృష్టలఘుప్రచారుఁడై స్వామి సచివుల కేదో చెప్పఁదగినది తోఁచినట్లు, ఏకపురుషవిశేషమును దెలుపుదానివలె మదాంధత్వమున నాప్రదేశమునకు గజరాజు వచ్చెను.

రాజు - విస్తర మట్లుండుఁగాక. కురంగికిఁ గుశలమే!

కౌంజా-స్వామిభాగ్యము తెల్లమై యుండఁ గుశలిని కాకెట్లగు?

రాజు - శుభము. ఇఁక యథేష్టముగా నుడువుము.

కౌంజా - అంతఁ బామరులు పాఱుచుండఁగా స్త్రీలు హాహాకారమాత్రప్రతీకారలు కాఁగా రాజభటులు సమీపించి హతులైరి. ఉద్యానమునకుఁ దెచ్చిన సర్వోపకరణములఁ బరీక్షింప ముహూర్తకాలము నేను నిలిచి నీతిచే దాఁగితి. ఇంతలో శీఘ్రముగా దేవరకుమారికయానముననే యేనుంగు సమీపించెను.

దేవి - ఇఁక నేమి కాఁబోవునోగదా!

రాజు - కురంగితోడ నెవరుండిరి?

కౌంజా - అంత నోకానోకదర్శనీ - (అర్ధోక్తితో నిలుపును)

రాజు - యథేష్టముగాఁ బల్కుము, వ్యాపదలు నిష్పరిహారములు.

కౌంజా - అంత నోకానోక దర్శనీయుండును, అవిస్మితుఁడును, తరుణుఁడు నయ్యు ననహంకారుఁడును, శూరుఁడు నయ్యును దాక్షిణ్యవంతుఁడును, సుకుమారుఁ డయ్యు బలవంతుఁడును, అగునోకఁడు, ఏనుగుఁచేఁ బరిభవింపఁబడు దేవరకుమారికకుఁ దత్కాలదుర్లభ మగు నభయప్రదానమిచ్చి నిర్విశంకముగా ద్విపవరము నొత్తెను.

రాజు - తనకారుణ్యమునకు ఋణము తీర్చుకొనెను. తరువాత!

కౌంజా - తరువాత నతనిచే నలలితసరభసకరతలతాడనప్రదుష్టమై యాదుష్టగజము వేగముగా దేవరపుత్రిని వదలి యతనిం జంపఁగోరి యాదిక్కుగా మరలెను.

దేవి - అతనికి క్షేమ మగుఁ గాక.

రాజు - తరువాత!

కౌంజా-అంత వెనుక వచ్చినభూతికుఁడును నేనును దేవరకుమారికను మరల యానముననెక్కించి త్వరగాఁ దోడ్తెంచి కన్యాంతఃపురములోఁ దెచ్చి విడిచితిమి.

రాజు - అహో, ఇది గొప్పప్రమాదము. అంత భూతికుఁ డేల రాఁడయ్యె?

కౌంజా-భూతికుఁడు నాతో నిట్లనెను; "నీవు పోయి ప్రభువున కీవృత్తాంతమును జెప్పుము; నే నాపురుషునిప్రవృత్తి యుఁ గులము నెఱింగి త్వరగా వత్తు" నని.

రాజు - అట్లయిన భూతికుఁ డంతయుఁ బరీక్షించి రాఁగలఁడు. కౌంజాయన! యాపరవ్యసనసహాయుఁ డేవంశమున జనించినవాఁడు?

కౌంజా - స్వామీ! నే నంత్యజుఁడ నని తన్నుఁ దా మఱుగు పఱచుచున్నాఁడు.

దేవి - మహారాజ! అకులీనున కిట్టిజాలి కలుగునా?

రాజు -అగునా యేమి!

(భూతికుఁడు ప్రవేశించును)

భూ - (విస్మయముతో) అహో, పృథివిలో రత్నములు డాఁగి యున్నవి! మనస్స్వలవిక్రమబుద్ధులు నేఁ డీపురుషుని నిర్వ్యాజపరాక్రమముచే మందీభూతములవలె నయ్యె. నా కొకసంశయము కలదు. ఎందుకొఱకుఁ దన్నును దనకులంబును మఱుగుపఱచు చున్నాఁడు? లేక సూర్యునిఁ జేతితోఁ గప్పుట కెవ్వనితరము? ఇందే కదా!

చ॥ గురుజనశాసనంబున నిగూఢనిజక్రియ వేఁచియుండె స
త్పురుషులు రూపుమాటువడ భూమిఁ జరింతురు పెక్కువెంటలన్
బరజనపీడ కెంతయుఁ గృపామతి నోర్వక కావఁగోరి త
ద్గురునియమంబుఁ దా మఱచి తోఁతురు లోకమువారి కేర్పడన్!

జయసేన! స్వామి యేప్రదేశమున నున్నాఁడు? ఏమి చెప్పెదవు—ఉపస్థాన గృహములో ననియా—అయిన నా ప్రదేశము శంకనీయము కాదు, కావున నందుఁ జొచ్చెదను. (ప్రవేశించి) అహో! మహారాజు దేవితో నిచ్చట నున్నాఁడు. (సమీపించి) మహారాజ! జయము.

రాజు - దేవీ! నీవు లోనికిఁ బోయి కురంగి నాశ్వాసింపుము, నేను నీవెంబడి నరుదెంచుచున్నాను.

దేవి - చిత్తము, మహారాజ! (నిష్క్రమించును).

రాజు - పరులకొఱకుఁ దనశరీర మాసింపని యాతనివృత్తాంత మేమయ్యె?

భూ - స్వామీ ! వినుఁడు, ముహూర్తము, అవలీలఁగా మెల్లగా సలలితముగాఁ బ్రియవయస్యునితోఁబోలె నా యేనుఁగుతోఁ గ్రీడించి నివర్తనానువర్తనగతివిశేషముల మోహింపఁజేసి తత్కార్మచే లజ్జితునివలె మహాజనప్రశంస నోర్వఁజాలక యవనతశిరస్కుఁడై స్వైరముగా స్వావాసమునకే యేఁగెను.

రాజు - ప్రీతి యయ్యె! ఇది నాకు రెండవలాభము!

భూ - అంత నాఁడుగజములతో దానిఁ బట్టుకొని యాగజశాలకుఁ దెచ్చి నే నాపురుషుని యన్వయప్రవృత్తు లెఱుఁగ నన్యాపదేశముగాఁ బోయితిని.

రాజు - ఏమి! నిశ్చయ మయ్యెనా? మేము చండాలుఁ డని వింటిమి.

భూ - పాపము శాంతించుఁ గాక. అట్టివాఁడు కాఁడు. ఏదో కారణమునఁ దన్నుఁ దనయన్వయమును గప్పిపుచ్చుచున్నాఁడు.

రాజు - నీ విఁకెఁ బరీక్షించిన దేమి?

భూ - అందుఁ బరీక్షింపఁదగిన దే మున్నది?

గీ. రూపు దివ్యంబు, మాట విప్రోపమంబు.
సౌకుమార్యంబు బలము తేజంబు క్షాత్ర
మయ్యుఁ జండాలభావ మెం దగునెయేని,
రిత్త యగు మాకు శాస్త్రపరిశ్రమంబు!

రాజు - అతనికిఁ గళత్రము గలదా ?

భూతి - అంతయుఁ గలదు. కళత్రమును స్వయముగాఁ జూడ లేదు.

రాజు - ఒకవేళ స్త్రీదర్శనము పరిహృత మేమో! ఏలయతని తండ్రిని బరికింప వైతివి ?

భూతి - సత్పాత్ర సంపన్నుఁడగు నతనిఁ జూచితిని. అతఁడు,

ఉ. పొడవుఁ దనర్చు దీర్ఘతయుఁ బొందిన భుజంబు కృతిశ్రమంబులం
గడవులఁజేసి యొప్పు బలిసింపుగుణంబరివోసి వోసి క
ట్టడి యగుఁ గాయకాచిన కడిందిప్రకోష్ఠము, సన్నఁడయ్యుఁజో
ష్టను నృపభావ ముద్దృతభానునిభంగిఁ బ్రభాసమేయతఁడ్.

రాజు - ఈప్రసంగము చాలును. మరల నిదియే పరీక్షింపఁ దగును.

భూ - చిత్తము, స్వామి !

రాజు - ఇఁకఁ గాశిరాజదూతవిషయమున నేమిచేయుదము ?

భూ - స్వామి! నూఱుమంది దూతలు వచ్చిరి, రాఁబోవు చున్నారు.

క. ఇందు ఘన కేమి యిటఁ జే
యందగుఁ గన్యాపితృత్వ మతివంద్యం బా
నందము రాజులు రాజసు
తం దలఁతురు నల్లతతి పతాకయుఁబోలెన్.

రాజు - నీయభిప్రాయ మేమి ?

భూతి - అన్నిచోట్ల దాక్షిణ్య ముంచ రాదు. వారిలో గుణ బాహుళ్యము నలవియుఁ జూచి త్వరయు దీర్ఘసూత్రతయుఁ బరిత్యజించి దేశకాలవిరోధములు లేక కార్యము సాధింపఁ దగు నని యర్థము.

రాజు - భూతికునిమాట యుక్తమే. కౌంజాయన! ఏలయూరకున్నావు?

కౌంజా - స్వామి, క్షత్రియు లనేకు లున్నను వారిలోఁ బూర్వ సంబంధు లగుకాశిరాజసౌవీరరాజులు స్వామికి భగినీపతు లగుటంజేసి సమానులు, మనకు సంబంధయోగ్యు లని తమచే నూహింపఁబడిరి. అందులోఁ బూర్వమే సౌవీరరాజు తనపుత్రునకుఁగా దూతం బనిచియుండె. అతని, మనకన్య యతిబాల యని యపదేశము చెప్పి, పూజించి పంపితిమి. ఇప్పుడును గాశిరాజు పుత్రునకుఁగా దూతం బంపియున్నాఁడు. వీరి బలాబల విచారములో దేవరయే ప్రమాణము.

రాజు - కౌంజాయనుఁడు చక్కఁగాఁ జెప్పెను. భూతిక! సర్వ రాజమండలమును వదలి యిూస్థాపించిన యిరువురిలో నెవ్వనిదెస విశేషము గలదు?

భూతి - రాజులను భృత్యులు దూషింపఁజనదు. స్వామ్యమాత్యులకు వారును బ్రభువులేగద!

రాజు - ఈ యుపచారవాక్యము లట్లుండనిమ్ము; ఏమి నిశ్చయించితి, చెప్పుము.

భూ - ఇఁకఁ బ్రత్యాఖ్యానము చెప్పరాదు. స్వామి! సౌవీర కాశిరాజులు తమ భగినీపతు లనుటలో సమానులు, మఱి దేవిగారియన్న యగుట సౌవీరరాజు గుణాధికుఁడు.

రాజు - మాసంకల్పమును నీవును నభిమతింపనివాఁడవు కావు.

భూ - రెంటను నా కనుగ్రహమయ్యె.

రాజు - ఓయీ! ఏల మరల సౌవీరేంద్రుఁడు దూతం బంపక పోయె?

భూ - అందే నాకు సందేహము కలదు. చక్కఁగాఁ బరీక్షించి చెప్పుద మని యీవిషయ మెత్తనైతి.

రాజు - అతనికిఁ గుశలమే?

భూ - చారపురుషు లిట్లు చెప్పుచున్నారు—

గీ. ఆత్మజుఁడుఁ దాను నే మైత్రి యరయరాదు!
నిర్వహింతురు మంత్రులె నీతిగతులు
కారణం బన్న నొక్కింత గానరాదు
పరుల కంతఃపురముఁ జొరఁ దగము గామి!

రాజు - హా! అతని కేమయి యుండును?

చ. మరునకు న్గ్ని మైనఁ గని మంత్రులు లోభగుణంబుతో మహీ
శ్వరుఁ జెఱవట్టిరో! స్వజనసంగతి నాదృతిఁ గోరనో సుజా
తురుఁ డయి! బ్రాహ్మణోత్తములు నూలి శపించిః శాంతిక్రియా
చరణముఁ బూనెనో! యెఱుఁగ క్ష్మాభృదగారనిరోధహేతువుల్!

ఈ వృత్తాంతమును త్వరగాఁ బరీక్షింపుము.

భూ - చిత్తము, స్వామీ.

రాజు - కౌంజాయన, ఇప్పు డీ కాశీరాజుదూతవిషయమున నేమి చేయుదము?

కౌంజా - ఇట్లె కాశీరాజదూతను బూజించి పంపవలయును. వివాహములు యథేష్టములుగా బహుముఖమున సాధింపఁబడుచున్నవి.

రాజు - అహో, మంత్రిబుద్ధి కార్య మపేక్షించుచున్నది కాని స్నేహమును బాటింపదు.

(తెరలో)

జయము స్వామి? జయము మహారాజ! పదిగడియ లయ్యెను.

భూతి - స్వామీ? తక్కినవిషయ మీనడుమఁ జింతింతము; స్నానవేళ మించుచున్నది; తమకుమారిక నూఱడింప వలసియున్నది; మహాదేవియు నెదురు చూచుచుం డును; ఈ యుపద్రవమువలన మహాజనము సైతము స్వామిం జూడఁగోరును.

రాజు - అహో! రాజ్య మనునది మహాభారము, ఎట్లనఁగా;

సీ. తొలుతొల్త ధర్మంబుఁ దలపోసి మంత్రులబుద్ధిపోకల నాత్మబుద్ధినరసి
యనురాగరోషంబు లడఁచి కాలముచూచి మెత్తినపరుసంబులొత్తిఁజేసి
పరచరనయనంబుబలిమి లోకానువర్తనములు రిపులరంధ్రములుఁ దెలిసి
యాత్మమండల మెప్పు డప్రమత్తతఁ గాచి బహుయత్నమునఁ దన్నుఁ
[బాదుగాచి

గీ. మఱియెవో భీమసంగ్రామంబు మలసి నేని
తృణముగాఁ దన్ను ననిమొన దిగ్గఁద్రోచు
వాఁడె పో భూమివిభుఁ డనువాఁడు వాని
బ్రదుకు కష్టంబు ప్రజ లెన్న భాగ్యశాలి!

(నిష్క్రమింతురు).

# అ వి మా ర క ము

---

ద్వితీయాంకము – ప్రథమరంగము

(విదూషకుఁడు ప్రవేశించును)

విదూ - ఈ ప్రభుపుత్రు లనువార లవస్థావిశేషము నెఱుఁగరు! ఇఁక నీ యవిమారకుఁడు ఋషిశాపముచేఁ గులభ్రంశనమును జండాలకులప్రవాసమును నిజవిజ్ఞానమును గురుజనమును బాటింపక హస్తిసంభ్రమదివసమునఁ గుంతిభోజుని గూతుఁ జూచెనో నాఁటఁగోలె నా కన్యుని వలె నయ్యెను. హీ! హీ! వే యేల? నాతోఁడ సల్లాపములఁ గోరఁడు; ఏవేళఁ జింతించుకొనుచుఁ దనలోఁ దానె క్రీడించుకొనుచుండు. 'గుంపుఁజొచ్చుట కొంప త్రచ్చుట' అను లోకప్రవాదము సత్యమే యయ్యెఁ గదా! ఎక్కడి సంబంధము? ఆ రాజపుత్రిక తానంత్యజుఁ డని తెలిసియుఁ గోరుచున్నది. నేనును బ్రాహ్మణులనింద రానీయక బ్రాహ్మణగృహముల లోఁ దిరుగుచు మఱుఁగు పఱచుకొనుచు నతనియింటికే పోవుచున్నాను.

(చేటి ప్రవేశించుచున్నది.)

చేటి - రాజకుల మిట్టియవస్థలోఁ బరిభ్రంశ మైనను జాలఁ బనిలేక నగరముఁ జూచుటకు వెడలితిని. ఓహో! ఇదె యార్యసంతుష్టుఁడు పోవుచున్నాఁడు. కానీ, వీనితోఁగూడ నవ్వులాడుచు ముహూర్తకాలము నిర్వేదము నపనయించుకొనెదను. ఓసీ, కౌముదీ! బ్రాహ్మణుఁడు లభించెనా? ఏమి చెప్పితివి? లభింపఁడనియా?

విదూ - చంద్రికా! ఇది యేమి?

చేటి - ఎవ్వనినైన బ్రాహ్మణుని వెదకుచున్నాను.

విదూ - బ్రాహ్మణుఁ డేల?

చేటి - వేఱే మున్నది? నిమంత్రణభోజనార్థము!

విదూ - అమ్మా, నే నెవ్వఁడను! శ్రమణకుఁడనా?

చేటి - నీ వవైదికుఁడవుగదా!

విదూ - ఎట్లు నే నవైదికుఁడ? అయిన వినుము. రామాయణ మనునాట్యశాస్త్రము కలదు. సంవత్సరములోఁగా దానిలో నైదు శ్లోకములు నేను పఠించి యున్నాను.

చేటి - తెలిసెఁ దెలిసె. ఇట్టి మేధావిభావ మయ్యగారికిఁ గులోచితమె.

విదూ - శ్లోకములు మాత్రమ కావు, వానియర్థము సైతము తెలిసికొంటిని. మఱియు వేఱువిశేష మొకటి గలదు

అక్షరము నర్థమును దెలిసిన బ్రాహ్మణుఁడు దొరకుట దుర్లభము.

చేటి - అట్లయిన నీయక్షరమేమో చెప్పుము. (నామముద్రికను జూపును).

విదూ - (తనలో) తెలియక నే నేమని చెప్పుదును? (ఆలోచించి) కాని యిట్లు చెప్పెదను. (ప్రకాశముగా) అమ్మా! ఈ యక్షరము నా పుస్తకమునఁ గాన రాదు.

చేటి - నీ కిది తెలియకున్న దక్షిణ లేక భుజింపుము.

విదూ - కానీ, కానీ.

చేటి - అయ్యగారి యుంగురమును జూతము.

విదూ - చూడు, చూడు మిది రమణీయమైనది.

చేటి - (పుచ్చుకొని) ఇదె భర్తృదారకుఁడు, ఇక్కో వచ్చుచున్నాఁడు.

విదూ - (తిరిగి చూచి) ఎక్కడ, ఎక్కడ, అతఁడు——

చేటి - ముగ్ధబ్రాహ్మణుఁడు మోసపోయెను! ఇదె వంచించి యీ గుంపులో దూఱి చతుష్పథమార్గమునఁ బాఱి పోయెదను. (నిష్క్రమించును).

విదూ - (కలయఁజూచి) చంద్రికా! చంద్రికా! ఎక్కడ? ఎక్కడ? చంద్రికా! హా! నేను మోసపోతిని! ఈ ముదుపుమారి లంజలశీల మెఱిఁగియు భోజనాశచే మోసపోతిని! (పరిక్రమించి) భోజనమ్ముమాటట్లైన మబద్ధ

మే య్యై యుండును. (ముందువంకకుఁ జూచి) అరే, ఇది
పరుగెత్తుచున్నది! నిలు, ఓసిచెడ్డతొత్తా, నిలు నిలు.
ఏమి? పరుగెత్తుచునే యున్నది! ఇఁక నేనును బరు
గెత్తెదను. (పరుగెత్తుచు) నాపాదములు కలలో నేనుఁ
గుచేఁ ద్రొక్కఁబడినట్లు నచ్చటచ్చటనే జారుచున్నవి.
ఆ! కానీ! ఈకుంభదాసి వృత్తాంతము నచ్చట వారికి
నివేదించెదను. (నిష్క్రమించును)

---

## ద్వితీయాంకము — ద్వితీయరంగము

(అవిమారకుఁడు కూర్చుండునట్లు ప్రవేశించును)

అవి — నేఁటను నాఁటిహస్తికర నిర్గత శీకరశీతలాంగిఁ బాఁ
గోఁడి మహాభ్రయాకులిత భూరివిలోలవిషాదనేత్ర నా
నాఁడినస్పృష్టి నిచ్చవడినం గలలన్ బతిఁ గాంచి మేల్కొనన్
బోఁడిగ సంస్మరింతు నిజపూర్వభవస్మృతివేది చాడ్పునన్!

అహో, అనంగుఁ డెంతబలవంతుఁడు! ఏలనఁగా

ఉ. ఒల్లదు నాటఁగోలె మఱియొండొకరూపముఁ జూడఁ జూడ్కి, యా
యుల్లము సంస్మృతిం దవిలి యూఁగుఁ బ్రసాదవిషాదశీలలన్,
డెల్లనవాఱు నెమ్మొగము, దేహము డయ్యక చిక్కఁబాఱు, నే
నల్లలనాడి యాడి పగ లాత్రి, మునుంగుదు రాత్రి మూర్ఛలన్!

లేక పురుషుల కధైర్యము యుక్తము కానేరదు. మద
నుఁడు తలఁపఁ దలఁప విజృంభించుచున్నాఁడు. కావున నే

ని సంకల్పింపక యూరకుండెదను. (స్మరించి) అహో! దాని రూపసంపద, రూపమునకుఁ దగిన యౌవనము, యౌవనము నకుఁ దగిన సౌకుమార్యము! ఇటనే,

మ. సలుపంబోలు విధాత యీనతిఁ బ్రతిచ్ఛందంబుగా యౌవనో
జ్జ్వలదివ్యాంగల కట్లు వోల, దుదురాప్సోదాగనీకాంతు శీ
లలనారూపము దాల్చెనో కొ! జలతల్పంబందు నిద్రింప బె
గ్గిలి కృష్ణుం డిగ ద్రావి యిక్కరణి లక్ష్మీదేవి యిం దున్న దో!

ఎట్లు నేను మరలఁ జింతింపఁదొడఁగితిని. ఇఁక నే నేమి చేయుదును? నామనస్సైతము నాయిచ్ఛలోఁ బ్రవర్తింపదు; ఇచ్చట,

క. మనసు నరికట్టి నిలిపిన
నొనరగ క్షణమేని యూరకుండదు, కాలం
జనుఁ జిరకాలము వల్లిం
చిన దుష్పాత్రంబనోలెఁ జేరదు తోవకె.

లేక మనస్సును జయింప శక్యముగాదేమో! దానినే తలంచెదను. అహో! స్త్రీగుణములెల్ల నిచ్చటఁ బొందుపడి యున్నవి. (చింతాభిభూతుఁడై కూర్చుండును).

(ధాత్రియును నళినికయుఁ బ్రవేశింతురు)

ధాత్రి - (వితర్కించి) అహో, కార్యమెంత సంకటమైనది? ఇట్లు జరిగినచో రాజకులము దూషిత మగును. ఇట్లు చేయకున్న నామె తప్పక నశించు. నే ననేకోపాయము లాలోచించితిని. నాకు నిప్పుడును, ఆమె మఱుఁగు పెఱచుచునే యున్నది. లేక యామె యేమి మఱుఁగు

పఱచుచున్నది? నాఁటినుండి యామె సుమనావర్ణక
మొల్లదు, ఆహారము రుచిచూడదు. గోష్ఠిజనముతోఁ
గ్రీడింపదు. దీర్ఘముగా నిట్టూర్పువిడుచును. అసంబద్ధ
ములు మాటాడును. చెప్పిన దెఱుఁగదు. గూఢముగా
నవ్వును, ఒంటరిగా నేడ్చును. రోగమును వంచించును.
కృశించుచున్నది. పాండుభావము పొందుచున్నది.
ఇందులో నొక యాశ్చర్యము; ఇట్టియవస్థా విశేషము
లతో నుండియు లజ్జ, భయము, కులమానము, బాల
భావము, వీనిచే నొకతెతో నైనఁ గొంచెమైన నాలో
చింపదు.

నళి - ఎందుకని చెప్పదు! నాతో నంతయుఁ జెప్పుచున్నది.

ధాత్రి - ఒసీ, నీయభిప్రాయ మెఱుఁగుదును. అవస్థ నెఱిఁగి
యెల్లవిధముల నతనితోఁ గూర్పవలయు ననుటయే.

నళి - కాక ఇట్టివా రట్టిగుణ విశేషములచే నకులీను లగు
దురా యేమి ?

ధాత్రి - అచ్చటనే సందేహము ? అమ్మగారి సమీపమున
మంత్రు లిట్లు చెప్పఁగా నేనును వింటిని, ' అది య
ట్టిది గాదు, ఏదో కారణమునఁ ద న్నంత్యకులజుఁడని
మఱుఁగు పఱచుకొనుచున్నాఁడు.'

నళి - అతఁ డెవఁడై యుండును ?

ధాత్రి - అసందేహామే లేనియెడల నితనికంటె గుణశాలి యెవ్వఁడు లభించును?

(తెరలో)

చ. కలిమియు రూపు సత్త్వమును జ్ఞానమునుం గులహీనులం దొగిం
గలిగినఁ గల్గుఁ గాక మఱి కల్గునొ శీలవిశుద్ధి వారికిం?
గలుగు వినంగ రీతిఁ దగు కాలము వచ్చిన వీనివంశముక్
గులగోత్రశంకఁ బుచ్చి సమకూర్పు మభీష్టములైన కార్యముల్!

ధాత్రి - ఓసీ, ఎవ్వఁడు పలికెను?

నళి - ఇచ్చట నెవ్వఁడును గానరాఁడు.

ధాత్రి - నామెను గగురు పొడుచుచున్నది. నిస్సంశయముగా దైవమె పలికెను. ఇది కేవలము మానుష మని తలఁప.

నళి - అతనికులసందేహము వాసెను. మనమాట వినునా వినఁడా యని చింతించుచున్నాను. (చింతించి) వీని నున్మాదింపఁ జేయఁగల యారూపము. ధన్య మైనది. వేయేల? వాఁడు మన్మథుఁ డైనను భర్తృదారికరూవ ముఁ జూచి క్లేశింపక మానఁడు. కావున నతఁడును క్లేశించుచుండు ననియే తలంచెదను.

ధాత్రి - ఓసీ, ఇదియె యతని గృహము. దీనికి నాఁడు హస్తి సంభ్రమదివసమున కౌతూహలముతో వచ్చియుంటిని.

నళి - ఓసీ, ద్వారముఖ మెంతదర్శనీయమై రమ్మని పిలుచు చున్నది! ఓసీ, రా, ప్రవేశింతము.

ధాత్రి - ఓసీ, భర్తృదారకుఁ డెక్కడ? ఏమిచెప్పితివి? చతుశ్శాలలోనున్నాఁ డనియా? (పరిక్రమించిచూచి) ఇతఁడె మన భర్తృదారకుఁ డొంటిగా నేమో చింతించుచునున్నాఁడు.

నళి - ఓసీ, ప్రవేశింతము.

ధాత్రి - అట్లచేయుదము. (ప్రవేశించి) అయ్యగారికి సుఖము!

అవి - అహో, దానిరూపసంపద!

ధాత్రి - (ఆకులముతో) ఏమి కానున్నది? అయ్యగారికి సుఖము.

అవి - మ. స్తనభారాలస మయ్యురంబు జఘనోద్యద్భారఖిన్నంబు పాదముల్

ధాత్రి - అమ్మో, ప్రలపించుచున్నాఁడు!

అవి - కిసలాభ్యుల్ సహజారుణాధరరుచా కల్లోల లీలాస్యముల్

ధాత్రి - ఇట్లున్మాదింపఁ జేసినయది ధన్యురాలే!

అవి - కనులం గ్రాలఁగ నొప్పు నేని యమృతాకారంబ భీతిల్లుచోఁ

ధాత్రి - కార్యము చక్కఁగా నున్నది.

అవి - దను వెట్లుండు నితాంతర ప్రచురమాంద్య ద్విభ్రమాపాదనస్త్రై !

ధాత్రి - ఆమెయే యితని నున్మాదించెను.

నళి - ఇతఁడును గ్లేశించుచుండు నని చక్కఁగాఁ జెప్పితివి.

ధాత్రి - నీవు చక్కఁగా నెఱింగితివి! అయ్యగారికి సుఖము.

అవి - (చూచి సిగ్గుతో) మీకు స్వాగతము.

ఇరు - సుఖమే?

అవి - మీదర్శనము వలన సుఖమే కాఁగలదు.

ధాత్రి - అయ్యా! ఏమి యాలోచించుచున్నారు?

అవి - అమ్మా, శాస్త్రము చింతించుచున్నాను.

ధాత్రి - ఇంత యేకాంతమునఁ జింతింపఁదగిన యట్టిరమణీయ శాస్త్రము పేరేమి?

అవి - అమ్మా! యోగశాస్త్రము.

ధాత్రి - (స్మితముతో) శుభము పలికితివి, యోగశాస్త్రమే యగుఁగాక.

అవి - (మనసులో) దీనివాక్యార్థ మేమి? అభిలాషవశమున నొకటి తలంచినను వే ఱొకటి చెప్పుచున్నాను. (ప్రకాశముగా) నీయభిప్రాయ మేమి?

ధాత్రి - యోగమును గోరియే మేమును వచ్చితిమి. అయ్యగారు యోగము ననుమతించిరనఁగానే రాజగృహమున మా యేకాంతావాసమునమాకును గార్యమునమకూరినట్లె. అచ్చటఁగూడ నొక రింతకు నధికముగ యోగమును జింతించుచున్నారు. వారితోడనె యచ్చటనె చక్కఁగా యోగవిధానము తామును జింతింపఁగలరని.

అవి - ఎట్లింకను నాకుభాగ్యము రానున్నది? (ఆసనమునుండి లేచి), అమ్మా! నాప్రాణముల మరల నిచ్చినట్లున్నవి. ఏలనఁగా,

ఉ. కాంత మొసంగు సౌఖ్యఫలకం బగు, నైనను జాలఁ దీక్ష్ణ, మ
త్యంతమనోజ్ఞ మయ్యును భయాకులదృష్టివిషోజ్జ్వలంబు, నే

నెంతయుఁ జూడఁ జూడ మది కెక్కు వికారము వెట్టిపుట్టె నీ
రింతకు వచ్చి వాగమృత మింతియ చిల్కునఁ జేతరించితిన్.

ధాత్రి - తా మామె నెదురుచూచుట శుభమే యయ్యె. అతి ప్రసంగము నాకేల? కన్యాపుర మిప్పుడ చొరఁదగును. కన్యాపుర రక్షకుఁడగు నార్యభూతికుఁడు పూజించి పంపిన కాశిరాజు దూతతో మా మహారాజు సెలవు మీఁద బయలువెడలెను.

అవి - మంచిది, ప్రథమకల్పము. అమ్మా, ఎవ్వఁడాతురుఁ డౌషధమును బొంది మందీభూతుఁ డగును?

ధాత్రి - ప్రవేశముమాత్రము దుర్లభము; లోన చిరకాల ముండుటకు వలను గలదు.

అవి - లోనఁ బ్రవేశించిగదా యాలోచింపఁ దగు; ప్రాసాద మాలలో నర్గళములనెల్ల వదల్చియుంపుఁడు.

ధాత్రి - అట్లు గావించెదము. లోపలఁ జేయఁదగినవెల్ల సంపాదించెదము. అయ్యగారు ప్రమత్తులై చొత్తురు కాక.

అవి - అమ్మా! రాజగృహవిధానముఁ జక్కఁగాఁ జెప్పుము.

ధాత్రి - ఈలాగు——

అవి - కానీ, పో.

క. విని రాజకులవిధానం
బనువుగ లోఁ జొచ్చినట్లు యాత్మకుఁ దోఁచెన్
అనుకూలదైవ ముండిన
జనులేమియు ననరు పౌరుషక్రియ సుఁగన్.

(చింతించి) అమ్మా! మాకీకార్యమున నమ్మకమేది?

ఇరువురు - ఇదియె ప్రత్యయము; జయము, భర్తృదారక!

అవి - కానీ, ఇఁకఁ బొండు. అర్ధరాత్రము నెదురుచూచుచుండుఁడు.

ఇరు - చిత్తము. (నిష్క్రమింతురు)

(విదూషకుఁడు ప్రవేశించును)

విదూ - అహో, నగర మిప్పు డెంత శోభిల్లుచున్నది! సూర్యభగవానుఁ డస్తమించి దధిపిండపాండురము లగు ప్రాసాదములమీఁదను, అగ్రాపణములయందును తేనెయు బెల్లపునీరును గురియున ట్లున్నాఁడు. గణికాజనులును, నాగరక జనులును, బరస్పర విశేష భూషణముల ధరించి తమ్ముఁ గానిపించుకొనఁ గోరి వారివారి మేడలపై విభ్రమముతోఁ జరించుచున్నారు. నేనో యున్మాదము సెందిన యతనితోడ నట్టివానిం జూచి నీ రాత్రి సహచరుఁడ నయ్యెద నని నగరము వెడలివచ్చితిని. అతఁడును మా యధన్యతచే నేదో యొక యనర్థచింతనముచే నన్యునివలె నయ్యె. ఇదియె యతనిగృహము. ఇప్పుడె నగరాపణాళిందమున, నచ్చట నతనియిల్లు వెడలి రాజదారికదాదియు, సఖియు, వచ్చిరని వింటిని. వారి కక్కడఁ బనియేమి? లేక పురుషునిభాగ్యములు హస్తిహస్తమువలె సంచ

లించుచుండును. లేకమాకనర్థమే వచ్చెనో; రానిమ్ము. అవస్థాసదృశమగు రాజగృహముఁ జొచ్చెదను. (ప్రవేశించి) హీ - హీ - ఇదె - యతఁడు కాముకజనవర్తకముచేఁ బూయఁబడినట్లు పాండుభావముతో నిటు వచ్చుచున్నాఁడు. కాక సురూపుల కన్నియు నలంకారములె. (సమీపించి) అయ్యా! జయము.

అవి - వయస్యా! నీవు నగరమునఁ జాలఁ దడసియున్నట్లున్నది.

విదూ - నీ విప్రుఁ డామంత్రణవిప్రలబ్ధుఁ డగు బ్రాహ్మణునివలె నహోరాత్రము చింతించుకొనుచున్నావు! నేను పగ లంతయు నగరము దిరిగి భోగము దొరకని ప్రాకృత గణికవలె రాత్రిఁ బ్రక్కను బండవచ్చుచున్నాను.

అవి - నీ కొక ప్రియవార్త చెప్పెదను.

విదూ - ఏమి? మనకు ఋషిశాపము సమాప్తమయ్యెనా?

అవి - తప్పక కాఁబోవుదానిలో సంతోష మేది?

విదూ - ఇఁక మఱియేమి?

అవి - ఏమి! కురంగి దాదిని, నళినికఁ జూడకుంటివా?

విదూ - అగునయ్యా, వారిని జూచితిని; ఏమి చెప్పిరి?

అవి - మాకు శోకౌషధము.

విదూ - అయినఁ జూతము.

అవి - సమయమునఁ జూతువు; ఇప్పు డిది వినుము.

అవి - చెప్పుఁడు, చెప్పుఁడు.

అవి - వేయేల, ఆమె యిప్పుడ కన్యాపురము ప్రవేశింపఁ దగు
నని చెప్పెను.

విదూ - (నవ్వి) ఏయుపాయముచే నభ్యంతరముఁ జొచ్చి
జీవము నిలుపుకొనఁ గోరెదవు? కుంతిభోజుని మంత్రు
లనఁగా విషమశీలురు.

అవి - ఎట్లు నీకును శంకింపఁజను? చూడుము.

క. సమసిరి తమసేనలతో
విమతులు నాయొకనిచేత విడిచిరి దర్పం
బమరారి యవిసె నవిరూ
పమున న్నాభుజముచేత భగ్నమే మనుజుల్.

క. తల యెత్త రరులు నేఁడును
బొలిసిరి నాయొకనిచేత మొసలుం డారుణ
బోలిఁ జెడియె నవనిశాటుఁడు
తల మెట్టినఁ గిట్టి నరు లుదగ్రులె నాకుణ.

విదూ - తెలియును. నీయమానుష కర్మముల నెఱుఁగుదును.
కాని రాత్రితోఁ బరగృహప్రవేశ మెల్లవిధముల శంక
నీయమే.

అవి - ఇది పరమార్థము, కుంతిభోజుని కన్యాపుర మెల్లవిధ
ములఁ జొరవలసినదే! మహాబ్రాహ్మణ! దాని కనుమత
ముగాఁ బల్కుము.

విదూ - న న్నెట్లు విడచిపోయెదవు? నేను నిన్నెప్పుడును విడు
వను. వచ్చుచున్నను గొనిపోవలసినదే.

అవి - నీకు శాస్త్రమార్గము తెలియదు.

క. చోరంజను జనునకుఁ బరమం
దిర మొక్కఁడ, మంతనంబు దీర్పఁగఁ దగు నొం
డొరుతోఁ బలువురితోడన్
నెరపందగుఁ గలను శాస్త్రనిర్ణయ మిదియున్.

కావున నేనొక్కఁడ కుంతిభోజుని కన్యాపురము చొరఁ జను. నీకు మాయందు సందేహమువలదు. చూడుము.

గీ. కుంతిభోజునిసేనల గుణము లేదు
నివహములఁజేసి యవలీల విభుగృహంబుఁ
జొరఁదగు భుజంబ యాయుధోత్కరము మాకు
నీకు శంకింపఁ బని యేమి నేస్తవగుచు?

విదూ - ఇట్లు నీవు నిశ్చయించియున్నయెడల నే నిప్పుడు నగరమునకుఁ బోయెదను. నా కక్కడ నొకమిత్రుఁడు గలఁడు. వానియింటిలోఁ బ్రొద్దు పుచ్చెదను.

అవి - నీవు బాగుగాఁ జెప్పితివి. ఇప్పు డభ్యంతరముఁ జొచ్చి యాహ్నికములఁ దీర్చుకొని మహారాజుగారి సెలవు మీఁద వాసగృహమున శయనసంవిధానముఁ జేరి యెవ్వ రెఱుఁగకుండ నగరము ప్రవేశించి నీ మిత్రగృహమునఁ బ్రొద్దుపుచ్చెదను.

(చేటి ప్రవేశించును)

చేటి - జయము, భర్తృదారక! స్నానోదకము సిద్ధమయ్యె.

అవి - ఇదె యిదె వచ్చితిని, ముందుగాఁ బో.

చేటి - చిత్తము. (నిష్క్రమించును.)

అవి - వయస్య! దివాకరభగవానుఁ డస్తమించెను. ఇప్పుడు-

క. బెరయఁగఁ జీకటితూర్పునఁ
బరఁగఁగ నెఱసంజకెంపు పడమటిదెస నం
బర మొప్పె నర్ధనారీ
శ్వరశోభాకృతి ద్విధావిభక్తాంతరమై.

విదూ - నీవు చక్కఁగాఁ జెప్పితివి. పగలు దాఁటిపోయినది; ప్రదోష మెక్కెను.

అవి - అహో, లోకస్వభావ మెంత విచిత్రమైనది.

చ. రవితిలకంబు పోఁ దుడిచి, భ్రాజదుడువ్రజరత్నమాలికం
దివుట ధరించి, యాతపము దీఱ, మనోహరశీతవాతముల్
నవకము గాఁగ రా, విటజనంబు సెలంగఁ గడంగఁ జోరు లు
త్సవమున, మర్త్యలోక మిదె చా నగు వేషము మార్చి వచ్చెనాఁ.

(నిష్క్రమింతురు)

---

పాఠాంతరము.

ప్రాగ్దిశాభాగ మంధకారమునఁ బూసి, పశ్చిమదిక్కున మైఁ దాల్చి సంజకెంపు
రెండునగములఁ దగి యంతరిక్ష మొప్పె, గాఁచె నర్ధనారీశ్వర రూపశోభ

# అ వి మా ర క ము

---

## తృతీయాంకము - ప్రథమరంగము

(కురంగియు నిద్దరు చేటికలును ప్రవేశింతురు)

కురం - ఓసీ, అతఁ డేమి చెప్పెను?

చేటి - భర్తృదారిక! ఎవ్వఁడు?

కురం - (తనలో) నిర్భాగ్యురాలను. నా హృదయము పగులు చున్నది. (ప్రకాశముగా) కన్యాపుర చేటుఁడు.

మాగి - నేను వానిం జూచితిని: మాటాడితిని: ఏమియుఁ జెప్పఁ డయ్యె.

కురం - అక్కటా! కన్యాపుర చేటుఁడు నాకు శుకపంజరము చేసి యియ్యఁ డని అమ్మకుఁ జెప్పియుంపెదను.

మాగి - భర్తృదారికకుఁగా శుకపంజరము తెచ్చియున్నారము గదా!

కురం - హాహా! మఱియేమున్నది?

మాగి - కాని.

కురం - ఓసీ, ప్రొద్దెంత?

మాగి - ప్రదోషము మునిఁగిపోయెను.

కురం - అట్లయినఁ బ్రాసాద మెక్కుదము.

మాగ - విలాసిని, ముందు పొమ్ము, శయనాసనములఁ గూర్పుము.

విలా - నీవు నిద్రించుచుంటివి! ఎప్పుడు శయనాసనములఁ బఱచితి నేమి ?

మాగ - ఓసీ, నీయలసత్త్వము నే నెఱుఁగుదును. పగలే కూర్చినవాని నిప్పుడు కూర్చితి ననెదవు.

విలా - ఓసీ, అట్లు చెప్పకు ; భర్తృదారికకుఁ గాక పెక్కులు గలవు.

మాగ - ఓసీ, పోయి యెఱింగెదను. (అందఱుఁ బరిక్రమింతురు)

మాగ - ఇదె ప్రాసాదము.

కురం - ముందుగాఁ బొమ్ము (ఎక్కుటను నటింతురు)

మాగ - బాపు, విలాసిని, బాపు! నీపేరునకుఁ దగినట్లు చేసితివి. ఈశిలాతలమునఁ బఱపు వైచితివి.

విలా - అభ్యంతర మండపమునను బఱపు పఱచితిని. మాగధికా ! చూడు చూడు నాయలసత్త్వము!

మాగ - నీ వతిపండితురాల వైతివి ; ఇట్లే పండితచేటునిఁ బెండ్లాడుము.

కురం - ఓసీ, ఈ శిలాతలమున ముహూర్తము కూర్చుండెదను.

మా - భర్తృదారిక యభీష్టముచొప్పుననే; కానిమ్ము.

(అందఱుఁ గూర్చున్నారు)

మాగ - భర్తృదారిక! ఒకకథ చెప్పెదను.

కురం - నీయసంబద్ధప్రలాపము నాకుఁ దెలియును.

మాగ - భర్తృదారిక! కథ క్రొత్తది.

కురం - వేఁడుకొనెద, నన్ను నిర్బంధింపకుము! ముహూర్తము పరుండెదను.

విలా - భర్తృదారిక సుఖముగా శయనించుఁగాక; నాకుఁ జెప్పుము.

కురం - (తనలో) ఏమిగా నుండును?

మాగ - ఓసీ, భర్తృదారికకు వలదు; నీవు వినుము.

(అని మెల్లఁగాఁ జెప్పును)

కురం - హుం, రహస్యము తెలిసె; కాడితిని.

విలా - నీ వెక్కడ వింటివి!

మాగ - అమ్మగారి పరిచారిక వసుమిత్ర చెప్పినది.

విలా - అమ్మగారే స్వయముగాఁ జెప్పియుందురు.

మాగ - కాశిరాజపుత్రుఁడు జయవర్మ యనువాఁడు గలఁడు. అతనికి భర్తృదారిక నిచ్చినట్లె; అతనిదూత రాఁగా మహారాజు పూజించెను. అతనిచిత్రపటమును గూతము పుచ్చుకొనెను.

కురం - (తనలో) ఇది యబద్ధము; నామనస్సునకుఁ దోఁచు చున్నది.

మాగ - అప్పు డమ్మగారిట్లు చెప్పిరి "నాకూఁతురు బాల; ఒకదిన మైనఁ జూడలేకుండఁజాల; మహారాజునకు నాయం దనుగ్రహము గలదేని యిచ్చటికే యల్లునిఁ బిలిపింతురుగాక" యని.

విలా - తరువాత,

మాగ - తరువాత మహారాజందునకును సమ్మతించి యప్పుడ మంచినక్షత్ర మని దూతతో నార్యభూతికునిఁ బంపిరి.

కురం - (తనలో) అయ్యో! కార్యము కాలాంతరిత మయ్యె.

విలా - భర్తృదారికకు రూపయౌవనములు సఫలమయ్యెనని మాకుం బ్రియము.

నళినిక - (ప్రవేశించి) నాతల్లి యిట్లు చెప్పెను. "పోయి యీ వృత్తాంతమును భర్తృదారికకుఁ జెప్పుము; ప్రియవార్తలు ప్రియులకుఁ జెప్పినప్పుడు ప్రియతరములగును. ఇఁక నదియు నన్నుఁ జూచి సర్వము నమ్మి చెప్పును. నేను సమయమున సమీపమునకు వత్తును" అని. కావున నీప్రియవార్త భర్తృదారికకుఁ జెప్పెదను.

(పరిక్రమించుచు)

కురం - ఏమి! నే నెన్నఁడును ననుభవించి యెఱుఁగని చింతారోగము నన్ను వెఱ్ఱిదానిఁ జేయుచున్నది; పుష్పహారము నొల్ల; గోష్ఠి రుచింపదు; ఇది మనోహరమయ్యు దారుణమే; నళినికా, ఇది యేమి?

మాగ - భర్తృదారిక, నేను మాగధికను.

విలా - భర్తృదారిక, నేను విలాసినినే.

నళి - (సమీపించి) భర్తృదారిక! నేను నళినికను. సోపానశబ్దము చేతనే భర్తృదారిక యెఱింగియుండును. భర్తృదారిక! అమ్మగా రిట్లు చెప్పిరి.

కురం - ఏమని?

నళి - ఇట్లని (చెవిలోఁ జెప్పును)

కురం - చారిత్రము హీన మగును.

నళి - ఇది సంభావనీయమె; అది యదియే.

కురం - నళినికా, దేహము నొత్తుము.

నళి - చిత్తము, భర్తృదారిక.

విలా - నళినిక, వివాహ మెప్పు డగును?

(తెరలో)

ఇప్పుడే.

నళి - చిరంజీవ.

(తెరలో)

రాజపురుషులారా! అమాత్యుఁడు వెడలిపోయెనని యతనిభృత్యులలో నొక్కఁడైనను గన్యాంతఃపురరక్షణార్థము వచ్చినవాఁడు కాఁడు. మీయిష్టానుసారము చేయుఁడు, నేను రేపు రాజునకు దీని నివేదించెదను.

విలా - ఓసీ, నళినికా! ఏమని వినవచ్చెను?

నళి - ఎప్పు డాభర్తృదారకుఁడు ప్రవేశించునో యప్పుడ వివాహము.

విలా - అవిఘ్నముగాఁ బ్రవేశించుఁగాక.

నళి - అట్ల యగుఁగాక.

మాగ - ఓసీ, రమ్ము చతుశ్శాలలోఁ గూర్చుందము.

విలా - అట్ల కానిమ్ము. ప్రదోషము గడచిపోయెను. వెన్నెల యెక్కెను.

నళి - ఓసీ, నాకు నాసన మేర్పఱుపుము.

మాగ - అవకాశ మున్నది. నిద్ర పోవువఱకును భర్తృదారికను సేవించుచుందుము.

నళి - అట్ల కానిమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు)

(మారకుఁడు చోరవేషముతోఁ ఖడ్గహస్తుఁడై రజ్జువుతోఁ బ్రవేశించును.)

- (విమర్శముతో) హా! తారుణ్య మనునది యెంతకష్టము ఏలనఁగా,

ఉ. పైకొను రాగముం బెనుచుఁ, బాల్పడఁ ద్రోయుఁ బ్రమాదవృత్తికిన్,
దూకొను సాహసక్రియకు, దోషవిచారము సేయ నొల్లఁ దే
పోకలనైన పైమెయిన పోవు, గణింపదు నీతిమార్గమున్,
బోకడఁబెట్టుఁ, బెద్ద లొకపోఁడిగఁ జెప్పినబుద్ధులేనియున్.

ఎందున కాత్మాధీనము లగు నర్థముల నిట్లు మందుఁడ నగుచున్నాను! ఇక్కడ,

చ. పురమున లేవు నా చననిపోకలు, రక్షులసార మెల్ల నె
ల్లరకును దెల్ల మీ తమములావున నర్ధమ రేయు భీష్మ మై
నెరసె, సహాయ మీ యసియు, నిశ్చితనిష్ఠిత మంతరాత్మయున్,
బరిపరిభంగు లేల తలఁపం; గలవే యిఁక దుష్కరార్థముల్.

అహో, అర్ధరాత్ర మెంతప్రతిభయము! ఇప్పుడు.

మ. ఘననిద్రారసమోహమగ్నులు జనుల్ గర్భస్థులుంబోలెఁ, జెం
దెనో ధ్యానస్థితి నాఁగ మేడ లెసఁగున్ నిశ్చేష్ట నిద్రాసుఖ
జ్జనమై, చీఁకటి కూరి క్రమింగెనో కో ! నా స్పర్శానుమేయంబు ల
య్యె నగంబుల్ జగ మెల్లరూపు మఱుఁగయ్యెన్ మాయమై డాఁగె
[నన్.

ఇప్పుడే కాళరాత్రి వర్తించుచున్నది.

ఉ. సాంద్రదునో తమశ్చయము పాధము గాఁ బురమార్గనిష్పగల్,
మీఱి తుఱంగలించుబలు మేడలపంక్తులు సైకతాళి గాఁ
దీఱినచీఁకటిం బదియుదిక్కులు రూపులు మాసి మున్గె నీ
దాఱినయంధకారమును దాఁటఁగఁ దెప్పఁగఁగాక శక్యమే.

(పరిక్రమించి చెవి యొగ్గి) హో, గాంధర్వధ్వనివలె విన వచ్చుచున్నది. ఎవ్వఁడు వీఁడు సర్వకాలముల సుఖముగాఁ బ్రియురాలితో గాంధర్వము ననుభవించుచున్నాఁడు. తెలిసె, తానె స్వయముగా వీణ వాయించుచున్నాఁడు. ఏలనఁగా,

క. పొడ వగు హర్మ్యము, జాలము
లడఁచిరి, తంత్రీనినాద మను నాదముతో
ముడివడు, బాహ్యస్థానము
కడుబయు, లిటు మీట స్త్రీసఖంబుల వశమే !

అయినను గీతముమాత్రము స్త్రీయది, ఏలనఁగా,

క. మందమయి విశదమయి గహీఁ
బొందుం దానంబు, గలిగె ముఖనాసిక సు
స్యంద మయి నాద, మింకయుఁ
జెందెంగంకణరవఁబు చేతాళముతోన్.

(పరిక్రమించిచూచి) హాహాహా! వీఁడు వేఱొకఁ డెవ్వఁడో దయితం బుజ్జగించుచున్నాఁడు. వీని యపరాధము గొప్పదే యైయుండును; ఇంతప్రౌఢయ్యు నీమె వీనిచే నూఱడ గొన్నది గాదు. కాక ప్రసన్నురాలైయె యీ వ్యపదేశమును గోరుచున్నదో యేమో? ఏలనఁగా,

ఉ. త్రువ్వెడుబాష్పబిందువులతో జడగద్గదజిహ్మకంఠరై
యెవ్వతె నీకు నే ననుచు నించుక పల్కు నిగూఢరాగయై,
యవ్వనజాక్షి తాఁ బ్రియున కగ్గము యయ్యు నుదారభావతన్
జివ్వలమాటలే పలుకు స్త్రీయగుటం బ్రతికూలవాదనన్.

భైరవస్వరము గలిగించు నీపక్షి యేది—? అగును; ఇదిగుడ్లగూబయే. ఎట్టిది నవ్వే? ఉలూకస్వరశ్రవణభీత యై యీకాంత తానె వీనిం గౌఁగిలించికొనియె! వయస్సునకుఁ బరవ్యాపారములఁజూచుట ధర్మమా యేమి? కావునఁ గడచిపోయెదను. (పరిక్రమించి) ఎవ్వఁడు వీఁడు నగరపుటంగడిముంగిట శంకతో నతిస్నిగ్ధముగ మాటలాడుచున్నాఁడు? వీఁడు మన బ్రహ్మచారియే కాఁబోలు.

చ. పరిజన మెయ్యెడ నాఁడు మని బాధయొనర్చ, విభూషణాళిచే
బొరసిననిస్వనంబు విని బెగ్గిలుఁ గామశరాభిభూతుఁడై,
నెయికలేనికూటమి గణించు, మఱుంగులె కోరుఁ, బ్రేయసిన్
బొరసి ప్రియంబుమై నెదురువోవఁగ నొల్లఁడు, జారుఁడయ్యెడున్.

3౮ ఇచ్చట నుండఁజనదు. అట్టాలప్రతోళీప్రదమహాముల
వలన సర్వావిఘ్నము లగు. కాని, ఈ ప్రాటిలోనె డిగియెదను.
కా (డిగి) ఎచ్చట నీప్రాటిని దాఁటుదును. (ఆలోచించి) కానీ, తోఁచెను.
మ ఈ హస్తిశాలలోఁ ద్రాళ్ళు కోసి యుంచెదను. (ఉంచి పరిక్ర
ద? మించి)

మ. అదె తంత్రీధ్వని! కామినీమధుర గీతారావ సంమేళితం

వేఱొకదెసఁ బోయెదను.

బదె! గంధస్ఫురణంబు కుంభివరదా నామోద సంబోధితం

ముహూర్తముండి పోయెదను.

బదె! దీపప్రభ యందు నుండెర భళీ! యారక్షు లున్నిద్రులై

గతియేమి?

సదరంబయ్యెడు రాత్రియొక్క మహీభృత్సద్మంబు బద్మంబులన్.

పోయెదను; ఇదియె యూమె చెప్పినమార్గము; ఇదె మందాకిని; ఇదె దారుపర్వతకము; అదియె యుపస్థానసభ; అహో, అది కన్యాపురప్రాసాదము. దీనిలోఁ గాష్ఠకర్మ బహుళతచేతను, జాలకములు దగ్గఱఁగా నుండుటచేతను, నెక్కుట సులు వగును. లేక దురారోహమగునేమో! ఏల,

ఉ. చిత్తములోనికోరికలు చేవడఁ దోయ్యలి డాయవచ్చి యీ
కొత్తిళ్ళ మెక్కి లోన డిగఁ గొంకుట నాకిటఁ యేల? దప్పిపై
పత్తిలిపోయి నాలుకయుఁ బద్మసరోవరనాళకంటకో
పాత్తిభయార్పితుం డగుచుఁ బాయునె పాథముఁ గ్రోల కెవ్వఁడున్?

కానీ మొక్కెదను (ఎక్కి) ఇదియె ఆమెచెప్పిన జాల యంత్రము. (తెఱచి, ప్రవేశించి చూచి) బాగు, కుంతిభోజ! బాగు. ఈ భవనము స్వర్గము నెగనవ్వుచున్నట్లున్నది. అట్లె.

ఉ. అంచలు నిద్రసేయు స్ఫటికామలరత్నశిలాతలంబులన్
నించిరి సైకతాళిఁ బురుణింప విదూరజహా క్తి కావళుల్
మించులు గ్రక్కుఁ గంబములు మేలిప్రవాళపరిష్కృతంబులై
యెంచఁగ వేయునేల మణులెండలు గాయఁగ డాఁగె దివ్వియల్.

ఇఁక రౌద్రవేషమేల? (చోరవేషము పుచ్చి కక్ష్యాబంధము వదలుచున్నాఁడు.)

నళి - భర్తృదారకుని వృత్తాంత మేమయ్యె? భర్తృదారికకు నీయవస్థలోఁ బొందరాని నిద్ర కలిగె, నిద్రపోనిమ్ము; ఇప్పుడు నాప్రియుఁడు వచ్చు నని విన్నంతనే—

అవి - (విని వేగముతో సమీపించి) అమ్మా, ఇదెనావృత్తాంతము.

నళి - (చూచి సహర్షముగా) భర్తృదారక! మీకు స్వాగతము.

అవి - (చూచి యానందముతో) అక్కాంతయే యది! దీనిఁజూచిన నాకు,

చ. తనియదు చూడ్కి మేఁ గలయఁ దారెడుకో సఁ గౌఁగిలింపఁగాఁ
గనుకనిఁ జెంది బుద్ధియును గాయ్వనఁబాఱెడు నొక్కకాంతమే
ల్కనుపఁగ, రాగ మంగము నలంతలఁ బెట్టునో నూలుకొల్పి పే
ర్చినయొలమిం బ్రసన్నమగు వ్రేల్మిడి మూర్ఛలు నంతరాత్మయున్.

నళి - (తనలో) ఇదె భగవంతుఁడు కామదేవుఁడు నదీప్రవాహమువలె రెండు ప్రక్కలఁ బీడించుచున్నాఁడు! భర్తృదారక, శయనతలము నలంకరింపుము.

అవి - మంచిది (కూర్చుండును.)

నళి - భర్తృదారక, భర్తృదారికను మేల్కొనుపుదునా ?

అవి - బాలచాపలము వలదు; చూడు.

ఈ కన్నులు నాకు రెండ, యొకకాఁబుగ వేయును గావు బుద్ధియుఁ
బ్రన్న నికోర్కులం దడవు పొల్పుడుటం గడుమూఢ మయ్యె నీ
యన్నువుఁ గాంచి నేఁడ మదనార్ణవపారముఁ జేరఁగంటి నా
కన్నులు మేమెయిఁ జెలువగాత్రములఁ విహరింప నోర్వవే ?

నళి - ఎఱుఁగుదు నెఱుఁగుదు భర్తృదారికకు భర్తృదారకుని పరిశ్రమము.

అవి - ఇప్పుడ నాపరిశ్రమము సఫల మయ్యె.

కురం - (మేల్కొని) ఓసీ, నిరనుక్రోశముగా నేమి చెప్పితివి?

నళి - భర్తృదారిక, నేను మొదటనె చెప్పనా ?

అవి - నాజీవితమునకు ఫలము పొందితిని; దేనిచే నిది యిట్టి మోహము పొందె ?

కురం - (తనలో) హుం, పరిభ్రష్ట నైతి! (ప్రకాశముగా) ఓసీ, నే నే మంటిని?

నళిని - భర్తృదారిక! ఏమియుఁ జెప్పలేదుగదా!

అవి - ఇది ఈమెమోహావిస్తరమున నాకు రెండవమోహము.

కురం - నళినికా! చాలప్రొద్దు కూర్చుంటివి, ప్రొద్దెంత?

నళి - అర్ధరాత్ర మయ్యె.

కురం - కావుననలసితివి; వచ్చినన్నుఁ గౌఁగిలించుకొనుము.

నళి - (మఱుఁగుగా) నేను దేహము నొత్తెదను; భర్తృదారికం గౌఁగిలింపుము.

అవి - (హర్షముతో) మంచిది. ఇట్లే నీవును బ్రియశతములను వినుము.

కురం - అతిస్నేహముచేఁ బ్రయోజన మేమి? ఇప్పుడె రమ్ము.

నళి - భర్తృదారిక, ఇదె యున్నాను.

కురం - (బలవంతముగా నవిమారకుని నీడ్చి కౌఁగిలించుకొనును.) హాం, ఎవరు నన్ను నొత్తుచున్నారు?

నళి - (చెవిలో) ఇట్లు.

కురం - (సంభ్రమముతో) అయ్యో. నాచారిత్రము హీనమైనది. నాకు భయమెత్తుచున్నది.

అవి -

చ. ఎడఁదలలోన నొండొరు వహించి యెఱింగియు నీవు క్రొత్తవే?
కడు వడఁకంగ నేల సురగాలికి నల్లలనాడుతీవవై
జడియకు మిందు నాదెసఁ బ్రసన్నవు కమ్ము శుభాంగి! వేయునున్
వడువుల వేఁడ నేల మగువా శరణాగతు నన్నుఁ గావుమా!

(కురంగి లజ్జతో నళినికఁ జూచును)

నళి - భర్తృదారక! లెమ్ము, లెమ్ము. భర్తృదారిక యడుగు-
చున్నది, లెమ్ము.

అవి - మంచిది. (లేచుచున్నాఁడు)

(ధాత్రి ప్రవేశించును)

ధాత్రి - జయము భర్తృదారక!

అవి - ఎట్లున్నావు?

ధా - నళినికా, మండపములోన పఱపు పఱచియున్నది. వీ
రిరువుర నందే ప్రవేశ పెట్టుము.

నళి - అట్లే, (ధాత్రి నిష్క్రమించును)

నళి - భర్తృదారక! లోమండపమునఁ బఱపువైచియున్నది.
భర్తృదారికతో నందుఁ జొత్తెండు.

అవి - నీవును బ్రియశతములను వినుము. (హస్తముతో కురంగి
హస్తము గ్రహించి లేచుచున్నాఁడు.)

నళి - రండు, రండు. భర్తృదారక!

అవి - ఇదె యిదె వచ్చుచున్నాను. (ఇద్దఱుఁ బరిక్రమింతురు)

అవి - (హర్షముతో) నా యౌవనఋణముఁ దీర్చుకొంటిని,
ఏలనఁగా,

శా. కన్నీటం దొలఁకాడుఁ గన్గవయుఁ జేఁ గ్రాలంగ నూటాడు లేఁ
జన్నుందోయియుఁ జెల్లుమోచు కటియుం జాజాడ వ్రీడాగతిన్
ఛన్నం బంఘ్రియుగంబు సప్తపదలక్ష్యం బయ్యెఁ బోం దబ్బ, రే
యన్నా! నూఱుయుగంబులున్నఁగలఁడే యన్యుండు ధన్యుండిలన్.

(అందఱు నిష్క్రమింతురు)

# అ వి మా ర క ము

---

## చతుర్థాంకము - ప్రథమరంగము

(చాంగేరికను గొని మాగధిక ప్రవేశించును)

మాగ - అహో, పరిజనుల ప్రమాదము ! సూర్యోదయ మయ్యును ప్రాసాదరచన కాలేదు. గోష్ఠీజనకోలాహలము వినరాదు ! ఏమైనది ? రాత్రి నిద్ర మేల్కొన్నందునఁ బ్రమాదముగా నిద్రించియుండును. కావున భర్తృదారికను మేల్కొనిపెదను. (పరిక్రమించును.)

(విలాసిని వీజనముతోఁ బ్రవేశించును).

విలా - మాగధిక ! నిలునిలుము.

మాగ - ఓసీ నన్ను వారింపకు, భర్తృదారికకొఱకు నేను సుమనావర్ణకము తెచ్చితిని.

విలా - భర్తృదారికకు సుమనావర్ణకముగాని, అలంకారముగాని యేల ?

మాగ - అవినీతా, అమంగళము వల్కకుము ! భర్తృదారిక యెల్లప్పుడు నలంకృత యగుఁగాక !

విలా - అట్లు కాదు! భర్తృదారిక కాకృతియే యలంకార మని చెప్పుచున్నాను.

మాగ - ఓ పిచ్చిదానా! పుష్పమును వాసింపఁజేయదా?

విలా - అది నిశ్చయము. స్వభావరమణీయము లగునట్టివి యలంకారముచే నతిరమణీయము లగును.

మాగ - ఓసీ, భర్తృదారిక రూపమున కనురూప మగు భర్తయే కలిగెను.

విలా - పక్షపాత మేల? భర్తృదారకుముందల భర్తృదారిక పద్మినివలె యగపడుచున్నది.

మాగ - బాగుగాఁ జెప్పితివి; నాకుఁ జూడ భగవంతుఁడు మన్మథుఁడు శరీరమెత్తిననిట్లుండు నని తోఁచుచున్నది.

విలా - కావుననే భర్తృదారిక భర్తృదారకువదలి క్షణమాత్ర మైన రమింప నొల్లదు.

(కన్నీళ్లతో నళినిక ప్రవేశించును.)

నళి - (శోకముతో) సుఖములకు విఘ్నములు పెక్కులనులోక ప్రవాదము సత్యమేగద! భర్తృదారిక కవిచ్ఛిన్నసుఖ సంభోగముతోడ రతి కలిగించి సంవత్సరమాత్రమ య్యె. మనగోష్ఠీజనుల కుత్తరకురువాసము మరలఁ గలిగె; ఇప్పుడు మరల మహారాజవృత్తాంత మెఱింగె నని విని నా శరీరము పగులుచున్నట్లున్నది. భర్తృ

దారికయు లజ్జాభయమదనులచే గొట్టఁబడుచు సంతాపముచే ముగ్ధాపగతచేతనయై యున్నది. ఈప్రాసాదము చూడ దీప మాఱినట్లు పాడుపడియున్నది. ఆ భర్తృదారకు నెడబాసిన నాకును దేనిలోను హృదయప్రీతి పుట్టదు. భర్తృదారకుఁ డవిఘ్నముగా వెడలిపోయెనని విని నాహృదయము ప్రహ్లాదించినట్టున్నది. ఇప్పుడు కన్యాపురమును జక్కఁగా నవరోధించిరి. అహో సఖులు, ఓసీ మాగధికా, ఇది యేమి?

మాగ - ఓసీ, ఏ మడిగితివి? భర్తృదారికకు మండనవేళ కదా!

నళి - ఉత్సవము దాఁటిపోయెను. (ఏడ్చుచున్నది)

ఇరు - ఇది స్వప్నమయ్యెనా యేమి? సమానులము, చెప్పుము.

నళి - భర్తృదారకుఁ డెల్లవిధములఁ బోయెను!

ఇరు - హాం——

నళి - నేనును భర్తృదారికదుఃఖమును జూడలే కిచ్చటికి వచ్చితిని.

మాగ - భర్తృదారికావస్థను జూడ శక్యము గాదు; అయిన నామె నూఱడింతము.

ఇరువు - అట్లే చేయుదము——(నిష్క్రమింతురు).

## చతుర్థాంకము - ద్వితీయరంగము

(ఆవిమారకుఁడు ప్రవేశించును)

అవి - (శోకముతో)

చ. కలిగెను గాక నా కెటులొ కన్నెలయంతిపురంబుఁ బాసి రా
వెలసినభాగ్యశేషమున, వేయును నేల శరీరమాత్రుఁడన్
జెలువకు నాఁకలో నిలచి చిత్తము నన్నిటఁ జేరరాదు నా
వలను దలంపఁబోదు విరివ్రాలినభృంగమువోలె నక్కటా!

కురంగి యవస్థ యే మై యుండునో!.

చ. చనవఱి యాఁడుపాపలు గుసాగుసలాడికొనంగ సిగ్గువో
యెనో! తనతండ్రి యంతిపురి కిక్కటఁ గ్రుక్కటఁ గాపువెట్టఁగా
మనమున నల్కెనో! బయిసిమాలినరాత్రుల నన్నుఁ గానకే
మునుకొను బాష్పవారిఁ బడి మూర్ఛ మునింగెనో యేమి సేయుదున్!

హా! ప్రతీకారము తోఁచెను. అదియు నాపై నపేక్షచేఁ దనయాత్మ నిలుపఁగోరదు. కావున నేనును దానికొఱకే ప్రాణములు పరిత్యజించెదను. (పరిక్రమించి) ఎడఁబాసి కొన్నిదివసము లయ్యె; ఇప్పుడును మనస్సును శరీరమును దుఃఖమును భరింపఁజాలనివివలె నాకుఁ దోఁచుచున్నది. ఇప్పుడును,——

ఉ. ఓలములేక తో నునికి నుబ్బుచునుండు మనోనురాగముల్
గ్రాలెడుదాని రూప మెసకం బగుదాని, విలాసయౌవన
శ్రీ లగుదానిఁ బాసి యొకవ్రేల్మిడియైనను వంచితుండ నా
కేల మనంగఁ, గల్గునొకొ యింతకు నెక్కుకృతఘ్నభావముల్ ?

ఇప్పుడు మన్మథునిచే లోన దహింపఁజేయఁబడుచున్న వానికి సహస్రరశ్మి యగు సూర్యభగవానుఁడు బొగ్గువలె నగుచున్నాఁడు. (కలయఁజూచి) నిదాఘ మెంత భయంకరమైనది; ఇప్పుడును,

మ. రవి యుగ్రజ్వరమట్లు పీల్చె మహిసారం బెల్ల నుష్ణాంశులన్,
దవవహ్నిం దరుకోటి యక్కురుజచేతంబోలె విచ్ఛాయతన్
నవిసెన్, శైలము లేడ్చెనో వివశతన్ నా నుచ్ఛ్రితాస్యద్రుహాల్
దవిలెన్, లోకము సూర్యపాకమునఁ జిత్తం బేది మూర్ఛిల్లునో!

నే నిప్పు డేమి చేయుదును! పోవుటకును సమర్థుఁడఁగాను, ఏలనఁగా,

చ. ధర సికతాగ్నిచూర్ణముల దారుణవాతము లేచిపూయఁగాఁ
బరువ పలాశముల్ నెఱపి బాధలువెట్టఁ దరువ్రజంబు, భా
స్కరుఁడు ద్రవస్వరూప మయి కాఁచెడునో కొక దవాగ్నిచందమై
ధర నవ సూర్యపాకచలితం బయి లోకము పక్వమయ్యెడున్!

హా, ప్రియా! హా, సుందరి! నాకుఁ బ్రతివచన మిమ్ము. (మూర్ఛనటించును—మరల నిట్టూర్చి, మీఁదఁ జూచి) సహస్రకిరణుఁడగు సూర్యభగవానుని మేఘము గప్పుకొనియెఁగదా! కాక,

ఆ. దీనఁ జిత్ర మేమి తెమ్మెరల్ గొనితేర
మేఘపంక్తి నెఱసి మిహిరుఁ గప్పె
మద్ధృదంతరాళమన్యుమండల మిది
కప్పెనేని చిత్రకర్మ గాదె?

ఈ జీవన్మరణ మేల? నా దేహము వదలెదను. (లేచి పరిక్రమించును) ఏమి చేయుదు; కానీ, తోచెను. ఈయరణ్య

తటాకమున మేను వదలిపెట్టెదను. ఛీ! నా మరణమార్గ మధర్మమే. అభిమానమోహమువలన గొప్పమార్గము మఱచితిని. వేఱొకవిధముగాఁ బ్రయత్నించెద. (చూచి) కానిమ్ము! తెలిసె. హా! సమీపమున దవాగ్ని కానవచ్చుచున్నది. దానిలో నాప్రాణముల వ్రేల్చెదను. (సమీపించి నమస్కరించి) భగవదగ్నీ!

గీ. ఒక్కచిత్తంబుతో నున్న యుగ్రములకు
నుల్లమునఁ గోర్కు లీడేర్ప నోపు నేని
యగ్ని యొసఁగెడు నాకు జన్మాంతరమున
నేకచిత్తానువృత్తి నయ్యిందువదన.

(అగ్నిలోఁ జొచ్చి కుతూహలముతో) ఏమి యిట్లున్నది!

చ. తరువులు విస్ఫులింగములతోఁ గున మండి ధరిత్రి వ్రాల వి
స్తర మగు మంటలో మలయచందన కర్దమశీతలంబు లై
కరఁగెడు మేన, నగ్నియును గాచి ననుం గృపతోడ మన్మథా
తురుఁ డని కౌఁగిలించెడు సుతుం జనకుండునుబోలె హృష్టుఁడై!

హా! ఇఁక దీనికంటె నద్భుత మేమున్నది! అగ్నియే నన్ను దహింపకున్నాఁడు. కాన దీనికినిఁ గారణము గలదు; వేఱొకవిధముగాఁ బ్రయత్నించెదను. (పరిక్రమించి) ఇది పెద్ద పర్వతమే.

ఉ. నీలపయోదపంక్తి సరణిం శిఖరావళి మాటు సేయ దే
వాళి నభోవిహారముల నల్లన యించుక విశ్రమింప నీ
శైలము మిత్రయుక్తి బుధసత్కృవి యోగవిలాససంపదం
గ్రాలియు నీచరాజుగతి గర్వ్యమ యయ్యెడు నిష్ఫలస్థితిన్.

కానీ, ఇప్పు డీశైలమునఁ బ్రాణముల వదలి పెట్టెదను. గాలిలోఁ బడినవానికి సర్వార్థసాధనము లోడఁ గూడును. కావున నెక్కెదను. (ఎక్కి చూచి) పర్వతమునం దున్న యీ నీటి స్నానముచేసి యుపస్పృశము చేసి మంత్రము జపించెద.

(అట్లు చేసి జపించును. విద్యాధరుఁడు ప్రియురాలితోఁ బ్రవేశించును.)

విద్యా -

మ. మునిసంఘం గురుభూమిఁబుచ్చి తడయక్ మోదించి యమ్మానసం
బున సన్మందరకందరాంతరములం బుష్పావృష్టి మెప్పించి యా
వనలీలన్ విహరించి హైమవతి దివ్యశ్రోణి నేత్రోత్సవం
బొనరెం బుత్తము చందనాద్రితట నిద్రోద్వృత్త మధ్యాహ్నమున్.

(ఆకాశయానము నిరూపించి) సౌదామని, చూడుచూడు! దూరముననున్న భగవతి - వసుంధరాదేవి యాకృతి యెంత రమణీయముగా నున్నదో! ఇట,

మ. గిరు లేనుంగులగున్నలై జలనిధుల్ క్రీడాతటాకంబులై
తరువుల్ శైవలమై సమస్థలముగా ధాత్రీతలం బొప్పె వి
స్తరసీమంతములై తరంగిణులు సౌధవ్యూహముల్ బిందులై
ధరవక్త్రిం బనఁ దోచు ధారుణి; తగున్ దా రూపసంక్షేపతన్.

భద్రా, హెచ్చరికగా నుండుము. శీతచందన నిలయగు మలయమునకుఁ బోవుచున్నాము.

సౌదా - అయ్యో! అట్లె.

(ఇరువు రాకాశయానము నిరూపింతురు)

సౌదా - అయ్యో, విశ్రమింపక పోవుటకు నావలనఁ గానేరదు.

విద్యా - అట్లయిన నేదోపర్వతమున ముహూర్తము విశ్రమించి పోవుదము.

సౌదా - అయ్యా, నా కది ప్రియమే. (ఇరువురు దిగుచున్నారు).

విద్యా - సౌదామని, చూడుచూడు!

గీ వేగగతి నభ్రగమనంబు వెనుకఁ బాఱు
జడధిముద్రితధర మీఁదఁ బడఁగఁబోలు!
నివె నగంబులు వర్షాభ్రనివహమట్లు
పెరిగి యెదు రెత్తు దెంచెడుఁ బెల్లు గాఁగ.

ప్రియురాలా! ఈ పర్వతము మనకు ముహూర్తకాల మాతిథ్య మొసంగ సమర్థమైన దానివలె నున్నది. కావున నిందు విశ్రమించి పోదము.

సౌదా - అయ్యా, అట్లేచేయుదము. (పుష్పాపచయము నటింతురు.)

విద్యా - పుష్పించిన వృక్షముల నాఱవభాగము మాకుఁబొం దవలసిన ధర్మము. కావున నీవృక్షములఋణము తీర్తము.

సౌదా - అయ్యా, అట్లే.

విద్యా - (అవిమారకుం జూచి), అహో, వీఁడెవ్వఁడు! (ఆలోచించి) ఆ! తెలిసె; మంత్రభ్రష్టుఁడగు విద్యాధరుఁడే; ఏల నఁగా నిట్టిరూప మితరులలోఁగానరాదు. శుభమునకే యితఁడు మనలఁ జూచెను; కానీ, మఱచినవీనిఁ బల్క రించెదను.

అవి - కానీ, దేవకార్య మయ్యె. ఇఁకఁ బడియెద. (ప్రక్కఁ జూచి విద్యాధరుం గని) ఓహో, ఎవఁడీతఁడు? లేక యిది స్వప్నమా? నేను నిద్ర సెంద లేదు. ఆ, అంత్యకాలమున మనుష్యు లేమో చూతురు; అదియే యిది కాఁబోలు; అదియు మూఢుల కేకదా; నేనో సర్వ మెఱుఁగుదును. కానీ, ఇతనిం బలుకరించెదను; అయ్యా! నీ వేవంశము నలంకరించుచున్నావు?

విద్యా - వినుము, నేను మేఘనాదుఁ డను విద్యాధరుఁడను. ఇదియె నాకుటుంబిని సౌదామని యనునది. ఇప్పుడు మలయపర్వతమున భగవదగస్త్యపాదుల నారాధింప విద్యాధరు లుత్సవము ప్రారంభించిరి. అచ్చటికి మేము సంకేతింపఁ బడితిమి. ఇచ్చట ముహూర్తము విశ్రమించి పోద మని యిందు దిగితిమి. ఇది మా వృత్తాంతము; ఇఁక నీ వెందుకొఱకు భూతలమును దేవలోకముగాఁ జేయుచున్నావు?

అవి - (తనలో) ఏమని చెప్పుదును? నా కంత్యకాలము వచ్చినది, అనృతము చెప్పరాదు. (ప్రకాశముగా) అయ్యా! సౌవీరరాజపుత్రుఁడ నవిమారక నామధేయుఁడను.

విద్యా - (తనలో) ఇది యనృతము; ఇతఁడు మానుషాకృతి గాఁడు (ప్రకాశముగా) మఱి యేల యిట నొంటరిగా వచ్చితివి?

అవి - (తనలో) ఏమని చెప్పుదును ? (అధోముఖుఁడై నిలుచును)

విద్యా - (తనలో) కాని, నేనే యెఱింగెదను (విద్య నావర్తించును అయ్యో, కష్టము ! ఇతఁ డగ్నిభగవానుని పుత్రుఁ డని తన్నెఱుంగఁడు. కుంతిభోజుని కూఁతుఁ గురంగి నభిలషించి దానితోఁ గ్రీడించుచుండి వృత్తాంతము విదితమై యిటు వెల్వడివచ్చెను. మఱియుఁ బ్రవేశో పాయము లభింపకునికిఁ బ్రాణములం బరిత్యజింపఁ గోరి మరుత్ప్రపాతమొనర్ప దీని నెక్కెను. అదియు నచ్చట జీవన్మరణ మనుభవించుచున్నది. వీని యీ కార్యమునకు నేను తోడయ్యెద. (ప్రకాశముగా) అవి మారక ! మైత్రి యనునది యచ్ఛలము. నే నెఱింగిన యీ విషయము గప్పిపుచ్చలేనైతి.

అవి - చెప్పుము.

విద్యా - నేఁటఁగోలె మనయిరువురకు మైత్రి కలుగుఁగాక. నీయవస్థయెల్లయు మాకుఁ దెల్లమయ్యె. నీవు ప్రాణ పరిత్యాగార్థ మిచ్చట కెక్కితివి గదా ?

అవి - వయస్య, అదియట్టిదే.

విద్యా - ఈ విస్రంభముచేఁ బ్రీతుఁడ నైతి; అజ్ఞాతముగా లోనఁబ్రవేశింప వెరవు గలదేని నీ వేమి చేయుదువు?

అవి - (హర్షముతో) వే ఱేమి గలదు? మీవెంటఁ బ్రవేశించె దను. అందులకే యీవ్యాక్షేపము.

విద్యా - అట్లయిన సఖా! ఈయంగులీయమును జూడుము.
(ఉంగరముఁ జూపుచున్నాఁడు)

అవి - వయస్య! దీనిచేఁ బ్రయోజనమేమి?

విద్యా - ఈయంగులీయకమును కుడిప్రేల ధరింతువేని యదృశ్యుఁడ వగుదువు. ఎడమప్రేలనుంచిన స్వభావముగా నుందువు.

అవి - వయస్య, అదియు నట్లయుండును.

విద్యా - నీ కిప్పుడ నమ్మకము పుట్టించెదను; వయస్య, నన్నుఁ జూచుచున్నావా?

అవి - ఇట్లు,-

విద్యా - అవధరింపుము.

అవి - అవధరించితిని.

విద్యా - (కుడిప్రేలవైచి) వయస్య! నన్నుఁజూచెదవా యేమి?

అవి - వయస్య! ఛాయయుఁ గానరాదు; ఇఁక శరీరము మాటయేల? ఇట్టివారే లోకమున సఖులనఁబడువారు!

మ. తిరుగన్నేర్తురు ప్రాణవల్లభలతో దివ్యావకాశంబులన్,
గిరికూటంబుల వశ్యవిద్యలగుచుం గ్రీడింపఁగానేర్తు, రి
ద్ధరణిన్ సర్వ మెఱుంగనేర్తు రసకృన్మంత్రప్రభావంబులన్,
బరఁగన్నేర్తురు చూడ్కికిన్ మఱుఁగఁ దోపం గ్రమ్మఱన్ లీలమై.

కానీ, ఇఁక దీనితో నేనును బ్రవేశించినట్లే.

విద్యా - (ఎడమప్రేల వైచుకొని) కావున దీనిఁ బుచ్చుకొనుము.

అవి - (ప్రతిగ్రహించి) అనుగృహీతుఁడ నైతిని.

విద్యా - కాదు, కాదు, నేనె యనుగృహీతుఁడ నైతిని; ఎందులకనఁగా,

క. వెలలేని రత్నమొందిన
యలఘుఁడు పరితుష్టుఁ డగునె? యర్థులకు మదిం
గలుగునదందద కాంక్షలు
వొలయఁగ మును దీర్చి యెలమి వొందకయున్నన్.

అవి - నా కొకసంశయము గలదు. నాశరీరమునఁ బరీక్షించుట కని చెప్పుటకు సిగ్గుపడుచున్నాను.

విద్యా - అట్లయిన, కుడిచ్రేల నుంచుకొనుము.

అవి - మంచిది. (అట్లుచేయును).

విద్యా - వయస్య, కత్తి పుచ్చుకొనుము.

అవి - మంచిది. (ఖడ్గము పుచ్చుకొని విస్మయముతో) అహహో, ఖడ్గప్రభావము!

క. పిడు గెట్లు మాఱుమలచెనో!
యడరెనో చపలాకలాప మడిదపురూపై,
యడఁగించి సూర్యకాంతుల
వడి మార్గ్యాను నడవి దావవహ్ని చెలంగన్.

విద్యా - అహహో, అగ్నిపుత్రునివీర్య మెట్టిది! ఈ ఖడ్గప్రభావ మును విద్యాధరులలోను గొంద ఱే సహింతురు. అగ్ని భగవానుఁడే రక్షించుచుండును.

అవి - (ఖడ్గమును జూచి) అహో, విద్యాదేవతల కెట్టిప్రభావము గలదు!

క. రా నయ్యె దివ్యశక్తులు
నే నెప్పటివాఁడఁ జేర, నెక్కిాతి గుణసం
మానతఁ బ్రభావహీనుల
కీవా మెయి గాక వేఱ యెఱుఁగంజను నే?

వయస్య! నాకార్య మైనది, ఖడ్గము పుచ్చుకొనుము.

విద్యా - నీకెట్లిష్టమో యట్లే, వయస్య! అంతర్హితుఁడును, అతని ముట్టినవాఁడును, అంతర్హితులగుదు రనుట నిశ్చయము.

అవి - మిత్రమా! ప్రీతి యయ్యె, ఇది యభ్యుదయముల కెల్ల నభ్యుదయము. సఖా! న న్నపేక్షించి యింతసేపు దడసితి వని తలంచెదను. ఇఁక వేళాతిక్రమము గానీ యకుము.

విద్యా - నీవు చెప్పుచుండఁగానే యాకసముఁ జొచ్చితిని.

అవి - బహుభాష లేల!

గీ. అఖిలవిద్యలు నగ్గంబు లైనవియొకు
నాచరింతు రె మాఱు మాయట్టివారు
ప్రాణ మిచ్చితి వమ్మేడ నైతి నన్ను
వెట్టే యని యేలు, నీపనివిందు నేను.

విద్యా - కపటము లేని నీబుద్ధి నేనెఱుంగుదును. నీవును నా మాట ననువర్తించెద వేని,

గీ. ఇందువదనకు నను దీని నెఱుఁగఁజెప్పి
యుండు మముఁబోలె, మాపోక యొత్తిచూచి
ప్రియకుఁ గ్రీడారసంబులఁ బ్రియము గూర్ప,
పనియుఁ గలిగిన మరల నీపజ్జనుందు.

అహో, పురుషసార మనునది నామనమును విడువ నొల్లదు. వయస్య! ఇఁకఁ బోయెదము.

అవి - పోయి మరల దర్శన మిందు.

విద్యా - మంచిది. (విద్యాధరుఁడు ప్రియురాలితో నెగయును.)

అవి - (మీఁదఁజూచి) ఇదే! మేఘనాదుఁడు గగనార్ణవమున మునింగెను. వీఁడు.

సీ. గమనవేగంబునఁ గడవెండ్రుకలు గాలి
తేఁదరంగంబులలీలఁ బొలయ
సలిలభృద్వీథులఁ జనఁజొచ్చి వెడలుచోఁ
గరఁగి మైపూఁతలు తెరలఁబాఱఁ
గడిఁదిగాఁ గట్టినయొడిలోనియడిపంబు
తళతళత్కాంతు లందందఁ గురియఁ
దన బహిఃప్రాణమై తనరుజవ్వనిచేతఁ
జడిగొన్నమధ్యంబు సన్నగిల్ల
నుత్తరీయంబు గాలికి నొత్తగిల్ల
ముకుటమణికాంతి తారకానికరములకు
మెఱుఁగు లీ మింటఁ జనఁజన మేను తఱిగి
మఱుఁగు విద్యాధరుండు శ్రీమంతుఁ డతఁడ!

ఈమెయు విద్యాబలమును శ్రీయు ననువర్తించు చున్నది. ఈమె,

చ. జనమునఁజేసి విచ్చగొని జాఱినవేనలి పజ్జఁబాయఁగా
లవలవఁ జన్నుదోయి గదలం దనుమధ్యము గ్రుంగి చిక్క ని
య్యువతి మనఃప్రియాంగమున నొయ్యన వ్రాలి మెఱుంగుచాడ్పునన్
గవకవఁ దోఁచి తోఁన మృఱుఁగంజను నల్లదె యభ్రవీథులన్!

మేఘనాదుఁ డికఁబోయెను. నేను నిష్పుడ నగరాభి ముఖుఁడ నయ్యెదను. ఇఁక దిగియెదను. (దిగి) నే నలసితిని. కానీ, ఈశిలాతలమున ముహూర్తము విశ్రమించి పోయెదను. (కూర్చుండును.)

(విదూషకుఁడు ప్రవేశించును)

విదూ - అహో! అచ్చట సుగృహీత నామధేయుఁ డగు సౌవీరభూపతి యధన్యత్వము! ఎట్లు చిరకాల మనప త్యుఁడై తన నియమ విశేషంబులచేతను దైవప్రసా దంబుచేతను మనుష్యలోక దుర్లభుఁడగు పుత్రునిం బడసి మఱియునట్లయయ్యె! ఎల్లవిధముల నాబ్రదుకు మాఱుటచేతను బంధుజనదౌర్భాగ్యముచేతను గుమా రుఁడు పరిభ్రష్టుఁడయ్యె! (పరిక్రమించి) ఇప్పుడు నామె నా కొమారుఁడు క్షేమముతో నున్నాఁడా యని యడిగెను! లేక యతి సుకుమారుఁ డగురాజకుమారుఁ డొంటరిగా మన్మథునిచేఁ గొట్టఁబడుచుఁ బరిభ్రష్టుఁడై జీవించి యుండు నని యెవ్వ రెఱుంగుదురు? నేనును

సకలలోకములు దిరిగి కుమారునిగాని కుమారుని శరీరమునుగాని చూచెదను. అట్లు చూడకున్న నతనికిఁ బరలోకమున సహాయుఁడ నయ్యెదను! నే నలసితిని. కానీ, ఈ వృక్షచ్ఛాయలో ముహూర్తము విశ్రమించి పోయెదను. (నిద్రించును.)

అవి - సంతుష్టునియవస్థ యేమై యుండును? నేను వెడలి వచ్చితి ననుట వినియుండెనా లెస్సయె, వినకుండెనా యాబ్రాహ్మణుఁడు విపన్నుఁ డగును. కాక యతఁడు లేక నాసర్వ ప్రయత్నము లేల ? అతఁడే—

చ. కలఁకుల యోధ, వైరిగణఘట్టన సాహసికుండు, నిండుగో
ష్ఠులఁ బరిహాస పేశలవచోవిభవుండు, గురుండు, శ్లోకవే
శుల హృదికిం మహోత్సవ విలాసము వొందఁగఁ జేయు, వేయుమా
టలఁ బనియేమి? యొక్కఁడ యొడల్ సడపాడెడు రెండురూపులై!

(కలయఁజూచి) ఓరీ! ఎవఁ డది నీడలోఁ బాంథుఁడు నిద్రించుచున్నాఁడు? (సమీపించి) నాహృదయమునకుఁ గోరినట్టుగా నాగత మయ్యె నభ్యుదయము. వీనినిఁ గౌఁగిలించుకొనుటకు నామనస్సు త్వరపడుచున్నది.

విదూ - (మేల్కని) చాలప్రొద్దునిద్రించితిని. ఇఁకఁబోయెదను.

మనోరథములు చెడినవారికి విశ్రాంతి యేల ? (పరిక్రమించి యవిమారకుం జూచి) ఎట్లు నీ విచ్చటికి-అవిమారక!—

అవి - అయే! స్నేహితుఁడు సంతుష్టుఁడు!—

(ఇద్దఱును గౌఁగిలించు కొనుచున్నారు)

విదూ - (గట్టిగానవ్వి) ఓవయస్య, చెప్పుచెప్పు మింతకాలమేమి చేయుచుంటివి ?

అవి - వయస్య, ఇదియే చేసితిని. (అంగుళీయకము దక్షిణాంగుళిలో వైచుకొని తిరస్కృతుఁ డగును.)

విదూ - హా, హా, నీ వెక్కడికిఁ బోయితివి ? ఎట్లగపడరావు ? హా, పోయెనను చింతచే నతనివలెఁ జూచితిని ! లేక తెల్లముగాఁ జేసికొనియెద. ఓవయస్యా,నీవు మఱుగు పఱచుకొనునెడల నొట్టు పెట్టితిని.

అవి - వయస్య, ఇదె యున్నాను.

విదూ - ఎక్క డెక్కడ ?

అవి - (ఎడమ వ్రేల నుంగరము ధరించి) వయస్య, ఇదె.

విదూ - మొదట శుద్ధుఁ డగు నవిమారకుఁ డుండె, ఇప్పుడు మాయావిమారకుఁ డయ్యెను; ఇట్లె, ఓమాయవిత్తక! ఏల నీవు కన్యాపురమునఁ బ్రచ్ఛన్న రూపుఁడ వై సంచరింపఁజాలవు ?

అవి - వయస్య, ఇప్పుడకదా యిది లభించె !

విదూ - ఆశ్చర్య మాశ్చర్యము ! ఎక్కడినుండి వచ్చెను !

అవి - అంతయు నంతఃపురములోఁ జెప్పెదను.

విదూ - ఇప్పుడు నే నాఁకలిగొనియున్నాను.

అవి - వైధేయ! ప్రవేశభూమిం బ్రవేశింతము. త్వరగా రమ్ము. నీవు నాచేయి వదలరాదు.

విదూ - ఆశ్చర్య మాశ్చర్యము. నేను నిఁక నదృశ్యుఁడనే; నాశరీర మున్నదా లేదా? లెమ్ము, చేయుదము. ధు-ధు-ధు——

అవి - మూర్ఖ; ఏల జాగుసేసెదవు? కాంతాదర్శనమునకుగా నామనస్సు త్వరపడుచున్నది. (లాగుచున్నాఁడు)

విదూ - నా కేమిశ్రద్ధ!

అవి - కానీ, భోజనవేళ నెదురుచూచుచున్నాను.

విదూ - కొంతప్రొద్దు విశ్రమించి పోవుదము.

అవి - ఏమి? ఇంకను నాకొఱకుఁ గురంగిని స్మరింపవు?

విదూ - నగ్నాంధశ్రమణిక జీవించియున్నదా?

అవి - వయస్య, నిన్ను వేఁడుకొనెదను, త్వరగా రమ్ము.

విదూ - ఎందువలన నీవు సమావర్తనము పొందినవటువువలెఁ ద్వరపడెదవు?

అవి - మూర్ఖ, ఇటు రమ్ము.

విదూ - న న్నీడువకుము. నేను వెంటఁ బరువెత్తి వచ్చెదను.

అవి - (పరిక్రమించి) ఇదియె నగరము.

విదూ - ఈనగరశోభ గానవచ్చుచున్నది.

అవి - ఇదియె రాజభవనము.

ఆ. సాహసించి రాత్రి శంకమైఁ జొచ్చితి
నీనరేంద్రభవన మిపుడు పగలె
సత్సమూహ మైంద్రజాలికుగతి శంకఁ
ద్రోచిచొత్తు మాయ దోడుపడఁగ.

(పరిక్రమించి) ఇప్పు డీప్రసాదమునఁ గురంగి స్నానము సేసి యభ్యంతరమున నుండును.

విదూ - అక్కడఁగాని యెక్కడఁగాని చొత్తము. భిక్షా వేళ యతిక్రమించుచున్నది.

అవి - రమ్ము; అట్లయిన నభ్యంతరమునకే పోదము. (చొచ్చి) ఇక్కడ.

ఉ. తొల్లిటిపొందు చేద్వడిన దుర్లభచింతలు మోచిమోచి రా
గిల్లుచు వచ్చి యిందుఁ గృతకృత్యతమై హృదయంబు హర్షసం
ఫుల్లముగా మనస్వులగుభూరి మహాద్భుత ధీరకర్మదు
ర్ధరుల కలంతి గాదఁటె చొరంజన నొండ్లగృహంబు లేనియుణ్?

(నిష్క్రమింతురు)

---

# అవిమారకము

---

## పంచమాంకము — ప్రథమరంగము

(కురంగియు నళినికయుఁ బ్రవేశింతురు)

నళి - భర్తృదారిక, ఏలసంతాపించెదవు. కన్యాపురప్రాసాద మెక్కి దృష్టివిలోభనము తీర్చుచుందము.

కురం - ఓసీ, నాహృదయము గుర్తెఱిఁగితివా యేమి? నా పరిజనము కానకయున్న నాకుఁబరితోషార్థమై తెచ్చిన వకుళ సరళ సర్జార్జున కదంబనీప నిచుళ ప్రభృతులు పరమసురభి పూతము లయ్యు మేఘకాల వల్లభములు కావున నా కున్మాదము కలిగించుచున్నవి. మఱియు నీమయూరము మాకు రాజగృహ మానసమునఁ జాల బీరమర్దభావమును బొందుచున్నది. మే మెప్పుడు లాలించుచున్నను దేశకాలముల నెఱుఁగమిచే నథిక జ్ఞత్వము చూపుచున్నది. శుకశారికలును గథలు చెప్పఁదొడంగెను. నా నిర్వేదము గుర్తింపక భూతిక శారికయు సర్వలోక వృత్తాంతము నుడివెద నని వచ్చి యున్నది. నారోగావస్థను విచారింప వచ్చిన పరిజన మును దమ్ము నిర్బంధించి తెలుపుకొనుచున్నారు.

కావున ముహూర్తము ప్రాసాదమున నుండఁగోరుచున్నాను.

నళి - భర్తృదారికకు రుచించినట్లే, కానీ. (ఇద్దఱు నెక్కుదురు)

కురం - ఓసీ, ఇచ్చటను మహానర్థకమే యయ్యె, కాలమేఘుఁడు విద్యుత్ప్రమదను ధరించియే లేచుచున్నాఁడు.

నళి - భర్తృదారిక, ఏలయుత్కంఠవడెదవు? చూడుచూడు నవమేఘములచే నావరింపఁబడి సూర్యునితో నాకాశమున విరళముగా నీరు వర్షించుచున్న దెంతరమణీయముగా నున్నది?

కురం - రమణీయ మగునాకసమును జూచుచు నున్నాను.

(అవిమారకుఁడును విదూషకుఁడును బ్రవేశింతురు)

అవి - వయస్యా, కురంగి యగపడుచున్నది; అది,

చ. అలఁదదు మేన దీర్ఘవిరహజ్వరసంవిధిఁ జేసి చల్లఁగాఁ
గలపము లేవియున్ దొడవు గైకొననొల్లదు హావభావలీ
లలు మఱువుచ్చెనైనను దలంప నిసర్గమనోహరాంగము
జ్జ్వలమయి యొప్పు హేతువుల వర్జిత వేదవిధి శ్రుతిక్రియన్.

విదూ - ఓ, సంతోష మయ్యె, నీవుసర్వలోకమున సురూపుఁడనని గర్వించెద విప్పుడు దీనిస్వభావరమణీయ మగు రూపము నిన్నుఁ దప్పక జయించుచున్నది. నీవియోగముచే నిది కృశించిన దని తలంచెదను; ఇట్లయినను బాలచంద్రరేఖవలెఁ జూడ్కులకు సంతోష మిచ్చుచున్నది.

అవి - సఖా, అతిపండితునవలె నిది యేమి!

విదూ - ఓ, నిత్యపరిచయముచే నన్నుఁ బరిహాసించెదవు. నన్నెఱుఁగనివాఁడు నాబుద్ధి నెక్కువగాఁ బ్రశంసించును; నేను నది యెఱింగియే యెవ్వనితోడను విస్రంభము చేయను.

అవి - ఏల యీయవహాసీస్యము! ప్రియురాలిం బ్రబోధింప బహుజన పరివారముచే నవకాశము కలుగదయ్యె. కావున నిప్పుడు మేడపై నున్నను నచ్చటనే దాని బోధించెదను.

విదూ - నీవు చక్కఁగాఁ జెప్పితివి; మేడ యెక్కుదము.

అవి - సఖా, ప్రాసాదశబ్దము కలుగఁగూడనియట్లు ప్రయత్నముతో నెక్కుము.

విదూ - అయ్యా, అది శక్యముకాదు; ఎంగిలిచేయక యెవ్వఁడు భుజింపఁగలఁడు? నే నిచ్చటనె యుండెద; నీవ యెక్కుము.

అవి - నేను నిన్ను విడిచితినేని నీ వగపడుదువు.

విదూ - అయ్యా, నే నది మఱచితిని; మరల మరలఁ జెప్పచుండుము.

అవి - ఇటు రమ్ము, (ఎక్కి చూచి) సఖా, ఇదె నాప్రియురాలు నళినికతో శిలాతలమున నున్నది; ఇది——

ఉ. వామకరంబునం బలుచవాలిన నెమ్మొగచుల్ల మోపి య
క్కాముఁడు తోడ రైయె పెరుగు కాలము శోకపువార్చివార్చి యి
వ్వాయువిలోలనేత్ర వలవంత మెయిం బయిఁబొంగు బాష్పవా
స్తోమము కట్టి నూర్ధ్వదిశఁ జూచెడుఁ గించిదలోల దృష్టియై.

కురం - (తనలో) ఈ జీవన్మరణముచే నేమగుచు? (ప్రకాశముగా) నళినికా, పోయిమాగధిక నుపస్నానముతోఁదోడ్తెమ్ము.

నళి - భర్తృదారిక నొంటరిగా విడిచి నేనెట్లు పోవుదును. ఇక్కడ నెవ్వరును లేరుగదా.

హారిణిక - (ప్రవేశించి) జయము భర్తృదారిక, అమ్మగారు, ఇప్పుడు తలనొప్పి యెట్లున్నదని యడుగుచున్నది. ఇదె యౌషధము పూసికొనుము.

కురం - నళినికా, నీ విఁకం బొమ్ము; దేవుఁడు వర్షింప నారంభించెనని తలంచెదను. నేను క్రొత్తవర్షపు నీటితో స్నానము సేయఁ గోరెదను! కావున నుపస్నానమును ద్వరగాఁ దెమ్ము.

నళిని - చిత్తము.

అవి - అది యేమి చెప్పెను?

కురం - ఓసీ, ఇటు రా.

నళి - అమ్మా, ఇదె యున్నాను.

కురం - ఓసీ, నీశరీరము చల్లగా నున్నది!

నళి - అమ్మా, నే నెఱుఁగను.

కురం - వచ్చి నన్నుఁ గౌఁగిలింపుము.

నళి - అమ్మా, అట్లె. (కౌఁగిలించుకొం౯రు)

కురం - ఓసీ, నీశరీర మతిశీతల మై మనోహరముగా నున్నది.

నళి - మీ దయ.

కురం - ఓసీ, ఇప్పుడు నాశరీరదాహము నశించు నట్లున్నది. (తనలో) సఖిప్రణయమైనది; నీశరీరసంసర్గ మింతతో ముగిసె! (ప్రకాశముగా) నీ విఁకఁ బొమ్మా.

నళి - చిత్తము. (నిష్క్రమించును)

హారి - భర్తృదారికా, అమ్మగారి కే మని నివేదింతును?

కురం - ఇప్పుడు రోగము నిర్వర్తించి సుఖముగా నున్న దని.

హారి - నీ కెట్లు తెలియు నని యడిగినయెడల నే మని విజ్ఞాపింతును.

కురం - చక్కగా నెఱిఁగితివి; ఈ యౌషధవిశేషముచే నని చెప్పుము.

హారి-చిత్తము. (నిష్క్రమించును)

అవి - దీనిచే నేమి చేయఁదలచెను?

ఆ. విడుచు నీక్రృశాంగి వేఁడినిట్టూర్పులు
నెఱయుకన్నునీటితెరలు గప్పఁ
గలయ సారె సారెఁ బొలయంగఁ జూచెడు
నేమి సేయ నిశ్చయించె నొక్కొ!

కురం - కానీ, పైట చెఱఁగుతో నురిఁబోసికొని ప్రాణము విడచెదను. (లేచి యట్లు చేయుచు నుఱుము విని) హాం, నన్ను రక్షింపుఁడు, రక్షింపుఁడు.

అవి - సఖా, ఇఁకమీఁద నుపేక్షింపరాదు. (అంగుళీయకము నెడమవ్రేలిలోఁ దగిలించుకొని) ప్రియురాలా, వెఱవకుము వెఱవకుము (అనుచుఁ గురంగిని లేపును)

కురం - (హర్షముతో) ఇది సత్యమా? మూఢురాలివలె నైతి.

అవి - కాంతా, శంక వదలుము. (కౌఁగిలించుకొనును)

కురం - ఆశ్చర్యము, నాశరీరదాహ మేకక్షణమున నశించి నట్లున్నది.

అవి - ఇదియే దీనిపరిష్వంగము.

క॥ మనమునఁ బాయమి నెప్పుడు
ననుభూతంబిదియుఁ దొలి స్వమాగతికంటెన్
జెనుచు రసమవని పతియని
మొనఁదెగువం జయముఁగన్న పొలు పగునాకున్.

విదూ - ఎక్లేడువ నారంభించె? అతిమాత్రసంతాప మేల? లేక నేను నేడ్చెదను. ఒక్కటిమాత్రము దుర్లభము, నాకన్నులలో నీరు కాఱదు. నాతండ్రిచచ్చిననాఁడును మహా ప్రయత్నమున నేడువ నారంభించితిని. కన్నీరు వెడలదు. ఇంక వేఱసంతాపమున కేల! అట్లయినను నుత్సుకుఁడఁగాకయు నేడ్చెదను.

అవి - ఔత్సుక్యహసన మేల? స్నేహ మనునది యచ్ఛలమొకదా.

క. ననుఁగడు మేలం బాడఁగఁ
జనెఁగాక మదీయబుద్ధిఁ జాలుదె తెగడన్ ?
దనుపంద కౌక బుద్ధుల
నెన యాగుదురె ప్రాజ్ఞు లజ్ఞు లిలఁ గార్యములన్ ?

నళినిక - (ప్రవేశించి) హారిణికా, హారిణికా, ఏల ద్వారము మూయఁబడియె ? అయ్యో, ద్వారనిరోధముచే వ్యసనము విడిచియున్నదని తలంచెదను; హారిణికా, హారిణికా ! హా ! ఛీ-అక్లే యయ్యెను.

అవి - నళినిక స్వరమువలెఁ దోఁచుచున్నది ; వయస్యా, ద్వారము తెఱువుము.

విదూ - చిత్తము. (తెఱచి) రా రా, అమ్మా.

నళి - హం, ఇట నెవ్వఁడీ పురుషుఁడు ?

విదూ - నీవు చక్కఁగాఁ గనిపెట్టితివి ! ఏమి రాజకులవిశేషము ! ఇఁక నెవ్వఁడు నన్నుఁ జూచి పురుషుఁ డని చెప్పును ? నే నాఁడుదానను.

అవి - నళినికా ! ఇటు రమ్ము.

నళి - భర్తృదారకుఁడా యేమి? భర్తృదారక,నమస్కారము. భర్తృదారక, ఈపురుషుఁడెవ్వఁడు.

విదూ - నేను బుషరిణి యనుచేటికను.

అవి - మేము చెప్పుచుండలేదా సంతుష్టుఁడని ; ఆ బ్రాహ్మణుఁడే యితఁడు.

నళి - ఆ, ఈ బ్రాహ్మణుని నగరాపణాలిందమున మున్ను చూచి యుంటిని.

విదూ - అగును, అమ్మా, యజ్ఞోపవీతముచే బ్రాహ్మణుఁడను, చీవరముచే రక్తపటుఁడ; బట్టతీసినచో శ్రమణకుఁడను అగుదును. అమ్మా, యిది యేమి?

నళి - భర్తృదారిక కుపస్నానము.

విదూ - ఇది యేల; ఆఁకలిగొని యేడ్చుచుండునామెకు నుపస్నానముచేఁ గార్య మేమి? పోయి శీఘ్రముగా భోజనము తెమ్ము. నే నగ్రాసనమునఁ గూర్చుండెదను.

నళి - దుర్బ్రాహ్మణ; ఇప్పుడును భోజనమే చింతించెదవు! అవి యన్నియు నటుండ నిమ్ము; పగటివేళ ననేకపురుష రక్షిత మగురాజమార్గమున నెట్లు భర్తృదారకుఁడు ప్రవేశించెను?

అవి - నీ కంతయు సంతుష్టుఁడు చెప్పును.

నళి - ఈ బహుమాన వాక్యముతో నన్ను వదల్చుచున్నారు. కానీ, పీనింగొని చతుశ్శాలఁ బ్రవేశించి గోష్ఠీజనము తోడ వృత్తాంతము వినియెదను. రమ్ము, బ్రాహ్మణ. (అని యీడ్చును.)

విదూ - అబ్రాహ్మణ్య మబ్రాహ్మణ్యము!

కురం - ఈ బ్రాహ్మణుఁడు హాస్యగాఁడు?

అవి - పియస్య, నీవుహాస్యుఁడవే?

విదూ - ఎవరు నన్ను శ్రద్ధసేయక యిట్లు పలుకుచున్నారు నేను హాస్యుఁడఁగాను; ఇప్పుడు నీవే హాస్యవు; నీయ వస్త్ర నెఱింగి యేమో చేయవలయు నని ప్రయత్నించి మేఘశబ్దమువిని సర్వముమఱచి క్రిందఁబడినదానవు.

కురం - హాం, ఇదియును వీరు చూచిరి.

నళి - యాచించెదను! ఇటు రమ్ము బ్రాహ్మణ.

విదూ - నీవు భోజనముపెట్టెడు పక్షమున వచ్చుచున్నాను. ఆగంతుకునకు భోజనదాన మిష్టమేకదా!

నళి - రమ్ము, నాయాభరణములనెల్ల నిచ్చెదను.

విదూ - నే యనుమాటచేఁ జిత్తము శమింపదు; నా చేతిలో నుంచుము.

నళి - అట్ల కానిమ్ము (ఆభరణములు దీసి యిచ్చును)

విదూ - వినుము, అమ్మా.

నళి - మూఢబ్రాహ్మణ, చతుశ్శాలలోఁ గూర్చుండి గోష్ఠీ జనముతోడ వినియెదను.

విదూ - అట్లయిన నమ్మగారి నడిగివచ్చెదను.

నళి - నీ వెవఁడవు, నాసొమ్ములన్నియుఁ బుచ్చుకొని వల్లభుఁడ వయితివి. పద (విదూషకుని చేయిపట్టి యీడ్చును)

విదూ - అమ్మా, ఇది వలదు, వలదు, నే నతిసుకుమారుఁడను గదా!

నళి - నీ సౌకుమార్యము నే నెఱుఁగుదును, సుకుమారుఁడ వై తేని శీఘ్రముగా రమ్ము.

విదూ - అమ్మా, ఇదె యిదె వచ్చుచున్నాను. (నిష్క్రమింతురు)

అవి - ప్రియురాలా! చూడు, చూడు. పరమ దర్శనీయము లై ప్రావృట్కాలవల్లభము లగు కాలమేఘములను; ఇవియే—

సీ. పలురూపచేష్టల జలదాగమముఁజాటు
జంభకాస్యము లైన శక్రునెద్దు
తారకాశుద్ధాంత తరుణులయవనికల్
గగనమార్గారూఢ గాఢనిశలు
విద్యుదహిస్త్రీ నివేశవల్మీకముల్
కుపితాంగనాసంధి గూఢచరులు
మన్మథాస్త్రనిశాన మణిశైలములు కుల
క్షోణీధరస్నాన కుంభఘటలు
నిమ్నగావల్లభునిచేత నీటిభిక్షఁ
జేసి జీవింపనేర్చు సన్న్యాసిగణము
భర్గుఁ జంద్రుని నిలుపోపు నర్గళంబు
లసురయంత్రప్రపలు వొల్చు నంబుదములు.

కురంగి - ఆర్యపుత్ర, ఇప్పుడు చాల దర్శనీయ మై యున్నది!

అవి - అహో, జలధార లెంత విరలముగాను విపులముగాను బడుచున్నవి; అట్లె,

చ. చదలినుహర్మ్యవార్షికలచందమునన్ మొరవెట్టుమేఘముల్,
వెదగాని మేఘముల్ మొలకవెట్టినయట్లొనఁబాఱు ధార, లు

న్మదదనుజాంగనా భ్రుకుటిమండిక్షె మెఱుంగులు విభ్రమించు బి
ట్టొదవె మనోజ్ఞ యామిని సమాధిగ సద్దన వేళ కామినీ!

కురం - ఆర్యపుత్ర! ఇప్పుడు దేవుఁడు వర్షింప నారంభించెను!

అవి - ప్రియా, రమ్ము లోపలఁ బ్రవేశింతము.

కురం - (హర్షముతో) ఆర్యపుత్ర, చిత్తము.

(నిష్క్రమింతురు).

# అవిమారకము

## షష్ఠాంకము - ప్రథమరంగము

(దాది ప్రవేశించుచున్నది)

దాది - అహో! కృతాంతుని యనవస్థ! మొదట రాజకుమారి సౌవీరమహారాజుచేఁ దనకుమారుఁడు విష్ణుసేనున కడిగి వరించికొనిరి ; ఇప్పు డవిదితసంభవముగా మనుష్యలోక దుర్లభాకృతిగుణ విశేషుఁ డగు నెవ్వఁడో దీనిం బొందెను. ఇఁక నిపుడు కాశిరాజు పుత్త్రుఁ డగుజయవర్మ యనువానిఁ దల్లియగు సుదర్శనతోఁగూడ మహామాత్యుఁడు భూతికుఁడు తోడ్తెచ్చి రాజగృహమున నిలిపెను. కాశిరాజు యజ్ఞవ్యాపారముచే స్వయముగా రాఁ డయ్యె. ఇప్పు డేమి కానున్నదో!

(వసుమిత్త్ర ప్రవేశించును)

వసు - అహో! సాంవత్సరికు లనువా రెంతవిషమ శీలురు! తమనక్షత్ర విశేషమే చింతింతురుగాని కర్మగౌరవము నెఱుంగరు. ఇప్పుడ కుమారుఁడు ప్రవేశించె. ఇప్పుడ వివాహము నియోగింపఁబడియె. (పరిక్రమించి) ఏమి!

ఈజయదయేమో యాలోచించుకొనుచు నప్రసన్న
ముఖముతో నుత్సుకురాలై కనఁబడుచున్నది.
జయదా, అమ్మగారు రమ్మని సెలవిచ్చిరి.

ధాత్రి - ఓసీ, ఎందునిమిత్త మని యెఱుఁగుదువా?

వసు - మఱి యే మున్నది? ఈకార్యమునఁ గర్తవ్య మాలో
చించుటకే.

ధా - ఇప్పు డమ్మగారి కేమి యభిప్రాయము?

వసు - తనవంశమునఁ బుట్టిన విష్ణుసేనునవస్థ గుర్తెఱుఁగ
జయవమ్మకుఁ గుమార్తె నీయ నొల్లకున్నది. మఱి
మహారాజు సౌవీరరాజు పుత్రుఁ దెలియరాకగద
జాల సంతాపమును బొందెను.

నళినిక - (ప్రవేశించి) మనకు సర్వసంకటములును సంకేతమ
చేసివచ్చిన ట్లయ్యె. (పరిక్రమించి చూచి) ఏమి యి
నాతల్లి యగు వసుమిత్రతో నేమో చింతించుచున్నది
వీరి సమీపించి యసుఖవృత్తాంతము వినెదను.

వసు - ఓసీ నళినికా, ఇటురా; నీవు కంచుకిసహవాసముచే
రాజకుల వృత్తాంత మెఱుంగుదువు.

నళి - క్రొత్తవృత్తాంతము; అది చెప్పుటకే వచ్చినాను.

వసు - ఓసీ, చెప్పవే.

నళి - సౌవీరరాజామాత్యు లొకదూతతో, "మాప్రభుః
మీనగరమున సపుత్త్రదార కళత్రుఁడై ప్రచ్ఛన్నుఁడై

ప్రతివసించుచున్నాఁ డని గూఢపురుషులచే నీవృత్తాంతము ప్రభువు తెలిసి మాకుఁ బంపుదురు గాక" యని చెప్పిపంపిరి.

ఇరు - ఎట్లు ప్రచ్ఛన్నవేషుఁడై వర్తించు చున్నాఁ డని! తరువాత.—

నళి - అంత నిది యంతయు విని యాలేఖ తుదివఱకుఁ జదివి యార్యభూతికునితోడ మహారాజతని నన్వేషింపఁ బోయెను.

ధా - ఏ మగునో?

వసు - నళినికా నీవట్లయిన లోనికిఁబొమ్ము.

నళి - అమ్మ, చిత్తము.

వసు - నీవు రా, మన మమ్మగారిని జూతము.

దాది - అట్లే చేయుదము. (నిష్క్రమింతురు)

---

## షష్ఠాంకము - ద్వితీయరంగము

(కుంతిభోజుఁడు సౌవీరరాజభూతికులును బ్రవేశింతురు)

కుంతి - వయస్య,

ఉ. నిన్నుఁ గనుంగొనంగలిగె నేఁడె మొగం బిది యేల చూచెదో
మిన్నక చిన్ననాటిచెలిమిం దలపోసి కవుంగిలింపు బి
గ్గన్నను, జెప్ప వాలుపక గాడిలి నిన్నొగిఁ జూడఁ గ్రొత్తయై
చెన్నొదవించె నెయ్యమునఁజేసి చెలంగు వయస్యభావముల్.

సౌవీ - నీయిష్టముచొప్పుననే. (ఇరువురుఁ గౌఁగిలించుకొందురు)

గీ. బుద్ధి చింతాకులత్వంబుఁ బొందియున్నట్లు
యయ్యె నను బాష్పగద్గద మయ్యె మాట
జాఱెఁ గన్నీరు ముఖ మప్రసన్న మయ్యె
హర్ష వేళ నికార నేల యయ్యె నయ్య?

సౌవీ - నీ సంగమముచే నేను సంతోషింపకుండలేదు; మ జేమనఁ బుత్రస్నేహ మనునది చాల బలవంత మైనది.

క. ఉల్లంబులోన నెగుచు
నొల్లం బగుపుత్త్రశోకము భవత్ప్రియ వా
క్యోల్లాపంబుల నిప్పుడు
పొల్లై కడు బాష్పరూపమున దివి కెగసెన్.

కుంతి - ఎట్టి పుత్త్రగతశోక మని.

భూతి - ప్రభువునకుఁ దెలియును. సంవత్సరముగాఁ గుమారుఁడు గానఁ డయ్యె.

సౌ - పుత్త్రస్నేహమనునది బలవంత మైనది. చూడుము.—

క. అనయము నడలుదుఁ గానక
యనుపమ బలవీర్యరూపు నవిమారకు నా
తనయుఁ భవచ్చరణాంబుజ
పునీతమౌళి యగు నేని పుణ్యుఁడ నిందున్.

భూతి - (తనలో) కుమారుని గానక యితనిసంతాపము పెద్దయుఁ బెరుగుచునే యున్నది. దీనిని మఱపించెదను. (ప్రకాశముగా) ప్రభువున కీయాపద యెట్లు సంభవించెను?

కుంతి - నేను నీవ్యాక్షేపముచే నిది యడుగ మఱచితిని.

సౌవీ - వినుఁడు; లేక భూతికుఁ డెఱింగియుండునేమో! అయి
నను నానోట వినఁగోరెడిఁగాబోలు.

కుంతి - మేమును విన నవహితులము.

సౌ - ఎల్లరకు విదితుఁడేకదా చండభార్గవుఁ డను నత్యంత
రోషి యగు బ్రహ్మర్షి.

కుం - అగు నట్టితపోనిధిని వినియున్నాఁడను.

సౌ - అతఁడు మా దేశమునకు వచ్చియుండెను. అరణ్యమున
నతనిశిష్యుని బులి యడ్డగించి చంపెను.

కుంతి - తరువాత,

సౌ - అంత నేను నప్పుడ మృగయావశంబున యదృచ్ఛగా
నా ప్రదేశమునకు వచ్చితిని.

కుంతి - తరువాత,

సౌ - అంత నన్నుఁ జూచి రోషము విజృంభింపఁగా బొమ్మ
ముడిచే భయంకర మగు మొగముతో జడలు వ్రేలాడు
చుండ శిష్యునిపైఁ జే యుంచి క్రోధాగ్నిచే మండుచు
నామాటలు విన నొల్లక సంరంభస్ఖలితవచనుఁ డై
నన్నుఁ బలువిధములఁ దిట్టఁదొడఁగెను.

కుంతి - తరువాత,

సౌ - అంత నేనును భవితవ్యార్థప్రాబల్యముచే ధైర్యము
వాసి "వృత్తాంతము చెప్పవు; నిష్కారణముగాఁ దిట్టె
దవు" అని కోపముతో నడిగితిని.

క. చెప్పవు వృత్తము రోషము
గుప్పె దకారణము చూడ్కిఁ గురిసెను నిప్పుల్
దప్పితివి తపసితపమున
మెప్పెదు బ్రహ్మర్షిరూపమున మాలఁడ వై.

కుంతి - నీవు చెప్పరానిది చెప్పితివి.

సౌవీ - అంత దాని విని యాజ్యధారచేఁ దడిసినహుతాశన నింబోలె నేత్రములు మండుచుండ మాటిమాటికిఁదల యూఁచుచుఁ "ఎట్టెట్లూ" అని చెప్పుచునన్ను శపింపఁ దొడఁగెను.

క. ఎట్టు నను బ్రహ్మఋషి యని
మట్టునఁ దలపెట్ట కీవు మాలం డని వే
తిట్టితి వట్టె భజింపుము
పెట్టున మాలతన మాలుబిడ్డలతోడన్?

కుంతి - అహో, కారణ మెంతయల్పము, అనర్థ మెంత పెద్దది!

భూతి - సౌవీరరాజకులము సభాగ్య మయ్యె; ఏలనఁగా,

క. కోపించి మాలతనమున్
శాపించెంగాక యట్టె సర్వము భస్మ
వ్యాపాదితంబు సేయక
పాపెం బ్రహ్మర్షి యిదియు భాగ్యము కాదే?

కుంతి - మీరు చక్కఁగా సూచించితిరి! తరువాత, తరువాత.

సౌవీ - తరువాత నాశాపమున మనస్సు కలంగి యతనిఁ గొంత తడ వనునయింప నల్లనల్లన ప్రకృతిస్థుఁడై నా కిట్లని యనుగ్రహించె.

క. ఒకవత్సరంబు కడసనఁ
  బ్రకటింపక క్రొత్తరూపుఁ బ్రచ్ఛన్నుఁడ నై
  యొక భంగి నేఁడు గడపిన
  సకలశ్రీ లంది మనుదు శాపము వాయన్.

అని యిట్లు చెప్పి ప్రసన్నచిత్తుఁడై "ఓ కాశ్యప! లేచిరా" అని పిలిచెను. వ్యాఘ్రము చంపినయావటువు నతనివెంట నంటెను. నేను నొకవత్సరము చండాలవ్రత మనుచరించితిని; నేఁడు శాపమువలన విముక్తుఁడ నైతి.

కుంతి - అహో ! ప్రవృత్తినివృత్తు లెంత విపత్కారణములు! శుభముగా వర్ధిల్లుము.

భూతి - జయము స్వామి.

కుంతి - విష్ణుసేనునితల్లి పరివారముతో నంతఃపురముఁజొచ్చెను.

భూతి - అచ్చట నాయమ లోనప్రవేశించి చిరకాలముగా నిద్రించిన ప్రణయమును మేల్కొనుపుచున్నది.

కుంతి - ఇఁక నిప్పుడు విష్ణుసేనుఁ డవిమారకుఁ డెట్లయ్యెను?

భూతి - వినుఁడు స్వామి, ధూమకేతు వనురాక్షసుఁ డుండెను. సకలలోకములఁ జంపుటకుఁ బరిభ్రమించుచు వాఁ డొకానొకప్పుడు సౌవీరరాష్ట్రమును బాడుసేయఁ దలపెట్టెను!

కుంతి - కథ యపూర్వమైనది. తరువాత !

భూతి - తరువాతఁ దనదేశమున సర్వప్రజలయార్తిం జూచి యారాక్షసునకుఁ బ్రతిక్రియ వెదకఁజాలక స్వామి క్లేశమును బొందెను.

కుంతి - తరువాత,

భూతి - తరువాత దానినెల్ల నెఱింగి కుమారుఁడు విష్ణుసేనుఁడు క్షితిరేణుపరుషగాత్రుఁడు, కాకపక్షములు వ్రేలాడు చుండఁ, దుల్యవయస్కు లగుశిశువులతోఁ నాడుచుండి దైవికముగా రక్షిపురుషు లేమఱియున్న వేళ రాక్షసుఁ డున్నప్రదేశమునకు వేగముగాఁ జనియె.

కుంతి - అహో, ఎంతయాశ్చర్య మెంతయాశ్చర్యము! తరువాత!

భూతి - తరువాత నారాక్షసుఁడు ప్రీతితోఁ జక్కఁగా నోఁడఁ గూడిన యాహారమువలెఁ గుమారుని మొగమెత్తి చూచి తనకార్య మొనర్చుకొనుచుండెను.

కుంతి - అహో, రాక్షసున కెంతనృశంసత! తరువాత,

భూతి - తరువాత, పిల్లవాఁడు నించుక నవ్వి,

క. పిడుగువడి గిరులఁ జీల్చెడు
వడువున దవవహ్ని నెఱసి వనదేశముఁ గా
ల్చెడునట్లు పోర నీచుని
బడవైచె నిరాయుధుండు బాలుఁడు లీలన్

కుంతి - నేను మొదటనే హస్తినసంభ్రమమునాఁడతఁడు దైవ మువలనఁ బుట్టియుండునుగాని కేవలము మనుష్యుఁడు గాఁడని చెప్పియుంటిని.

సౌవీ - మీరు సహస్రనేత్రులుగదా, అవిమారకుని గుఱించి చారులతో నెట్లాలోచించితిరి ?

భూతి - స్వామి!

క. చోరఁగలుగుచోటు లెల్లను
బరికించిరి చరులు పట్టువడఁడు కుమారుం
డరయఁగ మాయారూపము
ధరియింపఁగఁబోలు వెదకఁదగు నని తలఁతుꣳ.

(నారదుఁడు ప్రవేశించును.)

నారదుఁడు-

శా॥ వేదంబుల్ వినిపించి తండ్రికి ముదావేశంబు గావింతు, సం
మోదాబ్ధిꣳ హరిఁ దేల్చి మత్ప్రలకలం బొందింతు గీతాళి న
త్పాదింతుꣳ మధురస్వరంబు లెలమిం దంత్రీప్రతానంబులꣳ
భేదంబుల్ జనులం దివానిశము గల్పింతుꣳ బహూపాయతꣳ.

అహా! కుంతిభోజునితండ్రి దుర్యోధనుఁడు మమ్మఁ జిరకాల మారాధించెను. అమానుషస్వభావము పొందినప్పుడును మాయందుఁ గుంతిభోజుఁడు భృత్యభావమె చూపును. ఇప్పుడు కుంతిభోజసౌవీరరాజుల కవిమారకుఁడు గానరామిఁ గార్యసంకట మగుచున్నది. కావున నిప్పు డవిమారకుం జూపి వారిమనఃక్లేశమును బాపెద నని మర్త్యలోకమునకు డిగితిని.
(అని కుంతిభోజసౌవీరరాజులయెదుట నిలుచును)

కుంతి - అదె, భగవంతుఁడు దేవర్షినారదుఁడు! దేవ! నమస్కారము.

నార - స్వస్తి భవతే.

కుంతి - అనుగ్రహము.

సౌవీ - దేవ, నమస్కారము.

నార - శాంతి రస్తు తే

సౌవీ - అనుగ్రహము.

కుంతి - (చెవిలో) భూతిక, ఇట్లు చేయుము.

భూతి - చిత్తము, స్వామి. (నిష్క్రమించి-ప్రవేశించి) ఇవె యర్ఘ్యపాద్యములు.

కుంతి - దేవ! అనుగ్రహింపుఁడు.

నార - అట్లె కానిమ్ము.

కుంతి - (అభ్యర్చించి) దేవ, భవదవతరణమున మాగృహము పరిపూత మయ్యె.

సౌవీ - ఇప్పుడు దేవర్షిదర్శనముచే నాశాపము తొలఁగినది.

నార - నే నిప్పుడు మీదర్శనార్థము మాత్రమే వచ్చినవాఁడఁ గాను, అవిమారకుఁడు గానరాక మీయిరువురకుఁ గలిగిన దుఃఖము నెఱింగి డిగివచ్చితిని.

ఇరువు - అట్లయినయెడల మాసంతాపములు పోయినవి!

నార - భూతిక, సుదర్శనం బిలువుము.

భూతి - చిత్తము, దేవ. (నిష్క్రమించి సుదర్శనతోఁగూడఁ బ్రవేశించును)

సుద - దేవర్షి వచ్చెఁగదా!

భూతి - అట్లె.

సుద - ఇప్పుడె నాపుత్రకునకుఁ ద్వారలో వివాహము సంఘటించెను. దేవ, మ్రొక్కుచున్నాను.

నార-

క. అది య ట్లయ్యెడు మెప్పుడు
నొదవు మహాభాగ నీకు నుల్లపుఁగోర్కుల్
ముద మలరఁ గుంతిభోజుం
డదరని నీప్రేమ నోలలాడెడుఁ గాతన్!

సుద - అనుగ్రహము.

నార - ఇప్పుడు మీ రడుగఁదగిన యంశము నడుగుఁడు.

ఇరు - అనుగ్రహము.

కుంతి - దేవ, సౌవీరరాజపుత్రుఁడు బ్రదికియున్నాఁడా?

నార - గట్టిగా.

సౌవీ - ఏకారణముచే నగపడఁడు?

నార - వివాహవ్యాక్షేపమున.

సౌవీ - కుమారుఁ డెట్లు మన సిచ్చెను?

కుంతి - అంత నేప్రదేశమున?

నార - వైరంత్యనగరమున.

కుంతి - వైరంత్య మనునగరమును నున్నదనియా! కానిమ్ము, ఎవ్వని కల్లుఁ డయ్యెను!

నార - కుంతిభోజునకు.

కుంతి - అతఁ డెవ్వఁడు?

నార-

ఆ. ఇక్ష్వాకురంగితండ్రి యెన్నంగ వైరంత్య
పురవరేశ్వరుండు భూవరుండు
వీర్యమానయుతుఁడు దుర్యోధనునికన్న
కొడుక వైననీవ కుంతిభోజ!

కుంతి - వేయుఁబ్రశ్నము లేల, నాకుమారి కురంగికై వాఁ
నని దేవరవారు సెల విచ్చితిరి.

నార - అగునట్లె.

కుంతి - నాకు సిగ్గయిన ట్లున్నది. ఎవ్వ రిచ్చిరి? ఎట్లు
కన్యాపుర మతఁ డెట్లుచొచ్చె?

నార-

క. తొలుత విధి యిచ్చెఁ దొయ్యలిఁ
జెలువుఁడు గజసంభ్రమమునఁ జిత్తం బలరన్
దిలకించె మొదటఁ బౌరుష
మలవడ మాయాబలమున నవ్వలఁ జొచ్చెన్,

కుంతి - అట్ల యగుఁగాక; ఋషివచనమునకుఁ బ్రతివచనము గలదా? దేవ, ఇప్పుడు కుమారునకును గురంగికిని బ్రాప్తకాలమా యేమి? మొదట వివాహము ప్రారంభించి యుండవలసె.

నార - స్వసమయముననే వారలకు గాంధర్వ వివాహము నడచెఁగదా! ఇప్పుడు,—

కుంతి - అగ్నిసాక్షికముగాఁ గోరెదను.

నార - నిత్య మగ్ని సాక్షికముగానే! అట్లయినను స్వజనపరితోషణార్థ మభ్యంతర సమయమాత్ర ముపాధ్యాయునిచే జరిపించి త్వరగాఁ గుమారుని భార్యతోఁ దోడ్తెర నిండు.

కుంతి - దేవ, ఇదె పోవుచున్నాను.

నార - నిలుఁడు; భూతిక! నీవు పొమ్ము.

భూతి - దేవ, చిత్తము. (నిష్క్రమించును.)

కుంతి - దేవ, ఒక్కవిన్నపము,

నార - ఇటు రండు; స్వేచ్ఛగా సెలవిండు.

కుంతి - దేవ, సుదర్శనాపుత్రుఁడు జయవర్మకు మాకురంగి నిచ్చెద మని యూమెఁ బెనిమిటితో నిచటికిఁ బిలిపించితిమి; ఇప్పు డేమి చేయఁజనునో చెప్పుఁడు.

నార - (తనలో) ఇట్లొనర్చెదను (ప్రకాశముగా) ముహూర్తమేకాంతమున నుండుము.

కుంతి - అట్ల యగుఁగాక. (అట్లు చేయుచున్నాఁడు)

నార - సుదర్శనా, యిటు రమ్ము.

సుద - దేవ, ఇదె యున్నాను.

నార - మామాటలు నీకు వినవచ్చెనా?

సుద - సౌవీరరాజపుత్రుని గుణసంకీర్తనమును వింటిని.

నార - వలదు! ఇది పలదు; నీ కగ్ని దేవునివలన నతఁడు జ్యేష్ఠపుత్రుఁడై జన్మించె నని మఱచితివా?

సుద - హాం, ఇదియు దేవర కెఱుక యయ్యెనా?

నార - నా కాజ్ఞ యిమ్ము.

సుద - (తనలో) ఇట్లు చేసెదను. దేవా, చెప్పుఁడు.

నార - ఈకుమారుఁడు నీకు నగ్నికిని బ్రభవించెను. నీ తోఁబుట్టు సుచేతన ప్రసవింపఁగానే యకుమారుఁడు స్వర్గము పొందెను. నీవు నీపుత్రుని నీసోదరి కిచ్చితివి.

ఈసౌవీరరాజును జాల సంతుష్టుఁడై ప్రీతికిఁ దగిన క్రియలు నడపి విష్ణుసేనుఁ డనునామము నిడెను. అమానుష స్వరూపబలవీర్యపరాక్రమములతో వీఁడు పెరుగుచు, నవి రూపధారి యగురాక్షసుని సంహరించినందున నవిమారకుఁ డని విష్ణుసేనుని లోకము పేర్కొనుచుండును. అంత నతఁడును బ్రహ్మశాపపరిభ్రష్టుఁడై హస్తి సంభ్రమదివసమునఁ గురంగిం జూచి మదనాభిలాషము కలిగి పెద్దపౌరుషముతోఁ గన్యాపురముఁ జొచ్చి సంగమించి కురంగిం జూచి శంకించిన కన్యాపురరక్షులచేఁ బరీక్షింపఁబడి యగ్నిభగవానుఁడు తన్ను మఱుఁగు సేయఁగా నంతఃపురము వెల్వడి వచ్చెను. ఆనిర్వేదముచే నగ్నిఁ జొచ్చి తండ్రి యగు నగ్నిభగవానుఁడు ప్రీతిచేఁ గాఁగిలించుకొనఁగా నగ్ని దన్నుఁ గాల్ప నొల్లఁడని మరుత్ప్రపాతముకొఱకు కొకానొక పర్వత మెక్కెను.

సుద - అహో, ఎంతయాశ్చర్యము!

నార - అచ్చట నెవ్వఁడో యొక విద్యాధరుఁడు వానిరూపముఁ గనుంగొన్న మాత్రము హర్షించి. ప్రీతితో నంతర్ధానకార్యమాత్ర మగు నుంగురమొసంగెను. దానిఁ గుడిప్రేల ధరించిన నదృశ్యుఁడగును, ఎడప్రేల సహజముగా నగును.

సుద - ఆశ్చర్య మాశ్చర్యము.

నార - అంత దానిఁ గుడిప్రేల ధరించి సంతుష్టుఁ డనుబ్రాహ్మణునితోఁ గుంతిభోజుకన్యాపురముఁ దనయింటిం

బలెఁ జొచ్చి కురంగితో యథేష్టముగాఁ గ్రీడించుచు సుఖమున్నాఁడు. ఇదియే వృత్తాంతము. ఇఁకఁ జేయఁ దగిన దేమి?

సుద - తరువాత, ఆపూజ్యురాలు మోసపోయినందున నా హృదయము సంచలించున ట్లున్నది; కౌతూహలముచే సంతోషపడి యున్నది. దేవ, ఇన్ని దినములు కురంగిని జయవర్మభార్య యని పలుకుచుంటిమి. నేఁటిమొదలు వాని కామె వందనీయ యయ్యె.

నార - అభిజనులు చెప్పఁదగినరీతి సెల విచ్చితివి. అన్నభార్య నెట్లు తమ్ముఁన కొనఁగుట? సుదర్శనా, కాశిరాజైన జయవర్మతో జయవర్మకంటెఁ గురంగి వయస్సునఁ బెద్దది యని చెప్పుము. కురంగికంటెఁ జిన్నది సుమిత్ర యనునది యున్నదిగదా; అది జయవర్మకు భార్య యగుఁగాక.

సుద - ఋషివచనము ప్రతిగ్రహించితిని.

నార - పోయి కుంతిభోజు ననువర్తింపుము.

సుద - చిత్తము, దేవా.

(వరవేషముతో నవిమారకుఁడును గురంగియు భూతికుఁడును బ్రవేశింతురు)

అవి - అయ్యో, ఈవృత్తాంతముచే లజ్జితుసివలె నైతి.

క. అప్పుడు గజసంభ్రమమున
మెప్పుగ ననుఁ జూచి కడిమి మెచ్చినవారే
యిప్పుగిది వృత్త మరసినఁ
దప్పనినాచరిత యకట! తలఁపఁగ నయ్యెన్.

(పరిక్రమించి చూచి) ఆహా, ఇదె భగవంతుఁడు నారదుఁడు; ఇతఁడు,

గీ. శాపమునఁ బ్రసాదంబుల సక్త్వబుద్ధి
గానముల వేదముల రక్తకంఠుఁ డగుచుఁ
బూని మిత్రుల వైరంబు నోలయఁ జేసి
యమర సాధించు నష్టకార్యముల మరల.

కుంతి - ఇటు, ఇటు, కుమార, మనకులదైవ మగు దేవర్షికి నమస్కరింపుము.

అవి - దేవా, నమస్కారము.

నార - సపత్నీకునకు నీకు మే లగుఁగాక!

అవి - అనుగ్రహము; మామ, నమస్కారము.

కుంతి - లేలెమ్ము వత్స!

క. క్షమచే గెలువుము శత్రూ
త్తముల, నిజాశ్రితుల గెలువు దయచేతఁ, బరా
క్రమమున గెలువుము రాజుల,
నమలిన మగుతత్త్వబుద్ధి నాత్మ గెలువుమా.

అవి - అనుగ్రహము.

కుంతి - వత్స! ఇటు, ఇటు తండ్రికి నమస్కరింపుము.

అవి - నాయన! నమస్కారము.

సౌవీ - లేలెమ్ము వత్స.

క. వరవేషదర్శనీయుఁడు
గురుపదవందనమనోజ్ఞకుతుకాస్యుఁడు నీ
కరణిఁ దనయుండు మ్రొక్కఁగఁ
బరఁగుము నాయట్ల హర్షబాష్పాక్షుఁడవై.

పుత్త్రి! మామకు నమస్కరింపుము.

అవి - మాతా, నమస్కారము.

కుంతి - లేలెమ్ము, వత్స.

చ. వెలయుము మంగళాధ్వరపవిత్రుఁడ వై హరివోలె నిచ్చలున్
పొలుపుము నేర్మిఁ జిరఘువోలె దృఢవ్రత సత్యనిష్ఠ న
ర్థుల కెడ లేక యిచ్చి పితృతుల్యుఁడ వై నెగడొందు మాత్మ ని
శ్చలబలవిక్రమైకసదృశంబుగఁ జేర్మి మెలంగు మెయ్యెడన్.

సోఫీ - పుత్త్ర, సుదర్శనకు మ్రొక్కుము.

కుంతి - సుచేతనకు నమస్కరింపక సుదర్శనకు మ్రొక్క యయుక్తమువలె నున్నది.

నార - కారణము గలదు; సుదర్శనకు మ్రొక్కుము.

ఇరు - అట్ల చేయుఁడు.

అవి - అమ్మ, నమస్కరించుచున్నాను.

సుద - పుత్త్ర, ఈమెతోఁగూడఁ జిరంజీవి వగుము; (ఆలింగనము చేసికొని - తనలో) చిరకాలమునకుఁ జూచితిని; నేఁడ నేను పుత్త్రసంపత్తిరసము ననుభవించితిని. (ఏడ్చును)

కుంతి - ఈ సుదర్శన.

ఉ. తొంగలిఱెప్పలం దొలఁకుతోయకణంబులతోడఁ జూడఁగా
ముంగలఁబాలుకోరికలపొంగున నెవ్వలిచన్నుదోయిటం
బొంగి తలంకఁ బాలు తనపుత్త్రిని కవ్విళులూరు నీ మెఱే
జెంగినతల్లి యయ్యెడు, సుచేతన దాదియమాత్ర చూడఁగన్

నార - ఏల యతిస్నేహము? సుచేతన సుచేతనయు, సుదర్శన సుదర్శనయు, భార్యతోడికుమారుండు నంతఃపురముఁ బోత్తురుగాక.

కుంతి - చిత్తము, దేవ.

సుద - చిత్తము, దేవ!
హితో నాన్నాళ్ళలోనే సౌవీరరాజు స్వదేశమునకుం బోనిమ్ము
కుంతి - అనుగ్రహము. జగు జయవర్మకు సుమిత్ర నిచ్చి నీవును సన్ని
నార - కుంతిభోజ, నీకు ము.
కుంతి - దేవ, నాకుఁ బ్రసన్నుల రగుట యింతకంటె ... యుదును
డేమి గోరంబోయెదను.

క. సతతము గోబ్రాహ్మణులకు
హిత మొసఁగెడుఁ జెలఁగుఁ బ్రజల కెల్లసుఖంబుల్
నార - సౌవీరరాజ, నీ కేమి యధికముగాఁ బ్రియ మొనర్తును?
సౌవీ - నాకుఁ బ్రసన్నుల రేని యింతకంటె నెక్కుడేమి
గోరుదును ?

ధృతి నేలుమానవేంద్రుఁడు
చతురబ్ధివినీలవసన జగతిం బ్రీతిన్.
(అందఱు నిష్క్రమింతురు)

---

షష్ఠాంకము.
అవిమారకము ముగిసెను.

క. పరిధావినామసంవ
త్సర భాద్రపదంబులోన శుయపక్షమునం
స్థిరవారమునఁ ద్రయోదశి
విరచించెన్ రామకృష్ణవిబుధుఁడు దీనిన్.



THE INDIA PRINTING WORKS, MADRAS.